**AKSHRAANUBHUTULU**
by **Dr. J. Bapu Reddy**

First Edition : **2001**


*Price :* **Rs. 100/-**
**US** $10

**Jubilee Publications**
Plot 10, Road 5
Jubilee Hills
Hyderabad - 500 033 A.P. - INDIA

*Copies available at :*
**Visalandhra Publishers**
4-1-435, Bank Street, Vignan Bhavan
Hyderabad and Branches

**Book Links Corporation**
Narayanaguda, Hyderabad - 500 044.

**Navodaya Book House**
Opp. Arya Samaj Mandir
Kachiguda, Hyderabad - 500 027.

*Designed & Printed at :*
**Vipla Computer Services**
*(Designers & Multi Colour Offset Printers)*
Nallakunta, Hyderabad - 500 044
Phone : 767 3309

Released at 13th TAN Conference Phileddphic, USA (June 29th to July 1st, 2001) and Dedicated to Mr. B. Ramalinga Raju, Chairman, Satyam Computers Services Ltd.

# స్నేహ అంకితం



కృతి కర్త　　　　　　　　కృతి స్వీకర్త

పవిత్ర గోదావరి తీరంలోని గరికపర్రు గ్రామంలో జన్మించి,

తీరం లేని ప్రతిభా పాటవాలతో, ధైర్య సాహసాలతో

విశ్వవిఖ్యాతి గడించి,

తెలుగు తల్లికీ, భరత మాతకూ గర్వకారణమైన,

సత్యాన్వేషి, సద్గుణరాశి,

సైబర్ ప్రపంచ ప్రగతి యాత్రికుడు

సత్యం కంప్యూటర్ సర్వీసెస్ లిమిటెడ్ అధినేత

**శ్రీ బి. రామలింగరాజు గారికి**

13వ ఉత్తర అమెరికా తెలుగు మహాసభల్లో

(ఫిలడెల్ఫియా, జూన్ 29-జూలై 1, 2001)

ఆవిష్కరింపబడిన

నా **అక్షరానుభూతులు** కావ్య మంజరి

ఆత్మీయ అభినందన పూర్వకంగా, స్నేహోపాయనంగా

**అంకితం**

- జె. బాపురెడ్డి

# సత్యమైన గోదావరి స్వప్నం

గరగపర్రులో పుట్టిన
గోదావరి స్వప్నం నీవు
భీమేశ్వర క్షేత్రంలో వెలిగిన
ప్రేమారామ సత్యం నీవు -
పసిడి పచ్చల పైరగాలులతో
ఆటలాడిన బాల్యం నీది
"జిల్లి కాకినాడ" పెంచిన
మాతామహుల మమతల తోటల్లో
పల్లవించిన మనసు నీది
"యండగండి" కోటల్లో
విద్య నేర్చిన వివేకం,
సామునేర్చిన సాహసం నీది
పుస్తకాల నేస్తంలో
విస్తరించిన మస్తకం నీది
కలల అలల బాటలో సాగిన
వాస్తవ ప్రస్థానం నీది -

తెలుగు తల్లి మోము మీద
విరిసిన దరహాసం నీవు
భరతమాత ఒడినిండా
కురిసిన ఆనందం నీవు
అందుకే నీ వీనాడు
ప్రజాప్రగతి తపస్సు తప్ప
రాజ్యకాంక్షయే లేని
రామలింగరాజువు !

లయోలా కాలేజీ నిన్ను
లాలించిన నాడే
ఓహియో విశ్వవిద్యాలయం
ఓహెూ! యని నిన్ను
గుండెకు ఒత్తుకున్ననాడే
'హార్వర్డ్' నీ కార్యదక్షతకు
నారు పోసి నీరు పోసిన నాడే
నేటి నీ దిగ్విజయ భూజానికి
బీజం పడింది
అమెరికా ఊరింపులకన్నా
'అమ్మ' పిలుపే నిన్ను ఆకర్షించింది -

నీ ఆశలు, ఆకాంక్షలు నెరవేర్చే
కల్పవల్లి, మా చెల్లి
'నందిని' నీ జీవిత రసనిష్యందిని అయింది
ప్రీతంతేజ - రామరాజ
నందనవనం అయింది
సత్యం, శివం, సుందరం
నీ విజయ గోపురాల
మందిరం అయింది -

భాగ్యనగరంలో నడకనేర్చిన
నీ సమాచార సాంకేతిక
విజ్ఞాన జిజ్ఞాస యాత్ర
దేశదేశాలకు, ఖండఖండాలకు
కాంతివేగంతో సాగిపోతున్నది.

ఇప్పుడు నీ విలాసం
అంతరిక్షయవనిక మీద
అక్షర సత్యమై వెలుగుతున్నది
చరిత్ర తన భవిష్యత్తును
నీ 'చేతల'తో వ్రాయించుకుంటున్నది -

నీ అర్ధనిమీలిత నేత్రాలలోనుండి
పరిపూర్ణ మానవత్వం తొంగిచూస్తున్నది
నీ చిరునవ్వుల పెదవుల మీద
సత్య నాదం రవళిస్తున్నది
నీ వేషభాషల సహజత్వంలో
పారదర్శకత ప్రతిబింబిస్తున్నది
మానవ జాతికి
సమతాభ్యుదయ నీతికి
అంకితమైన నీ వెంట
కాలమే కదలివస్తున్నది -

'మిల్టన్లకు' కూడా కనిపించిన ప్రతిభా ప్రభ నీది
'క్లింటన్లకు' కూడా వినిపించిన
సత్యతత్వ వాణి నీది

కడలి వంటి చైతన్యం
నీ ఒంటిలో ఒదిగి ఉన్నా
రత్న మౌక్తికాలు నీ
అస్తిత్వాన్ని నిరూపిస్తున్నా
గులకరాళ్లనూ, గుడ్డి గవ్వలనూ
కనికరించి, ప్రేమించి
కలిసి ఆడటం కోసం
దూరదూర తీరాలకుదూసుక పోయే దాక్షిణ్య తరంగం నీవు

శాఖోపశాఖలుగా విస్తరించిన
సత్యం కంప్యూటర్ సేవలు
సనాతన ధర్మపథం మీద
అధునాతన విజ్ఞాన యాత్రలు చేస్తున్నవి -
దేవాలయ విద్యాలయ శక్తులను
దేశభక్తితో పోషిస్తున్నవి.

స్థిత ప్రజ్ఞత్వం
నిష్కామకర్మయోగత్వం
నీ జీవిత ధర్మ'క్షాత్రం'లో
నిత్యానుష్ఠాన గీతమై
సత్యాదర్శం చాటుతున్నది,
నీ త్రికరణశుద్ధి బుద్ధి
నేటి యుగ చైతన్యాన్ని మీటుతున్నది
అందుకే
ఈ 'అక్షరానుభూతుల' గోదావరి
నీ ఆత్మీయతా సాగరానికి
అంకితమైపోతున్నది
స్వీకరించు రామలింగరాజా !
అవిశ్రాంత జీవన వీచిరాజా !
మన అమృత భావరాగంలో
మహిత స్నేహ యోగంగా . . .

- జె. బాపు రెడ్డి

# ఎందరో మహానుభావులు . . .

ఈ గ్రంథం సంపుటీకరించిన నా అక్షరానుభూతులు. . . నా సుదీర్ఘ జీవితానుభూతులు. తోటి మానవాళితో పంచుకుంటున్న లౌకిక, అలౌకిక, భౌతిక, ఆధ్యాత్మిక, చింతనాపరమైన ఆలోచనలు, ఆవేదనలు, ఆనంద స్పందనలు. జీవిత యాత్రలో జీవుని వేదనలో, సత్యాన్వేషణ లో వెలుగు చీకట్లు సాక్షాత్కరిస్తాయి. అవి కలిగించిన భావావేశ కవితానుభూతులకు అక్షరాకృతులు ఇవి.

మానవుని మహోజ్వల పరిణామానికి, దివ్యత్వ సాధనకు, సమసమాజ నిర్మాణానికి మానవత్వ వికాసానికి ఈ అక్షరానుభూతులు దోహదం చచెయగలవని ఆశిస్తున్నాను.

ఈ పుస్తకాన్ని 13వ ఉత్తర అమెరికా తెలుగు మహాసభల్లో ఆవిష్కరించే అవకాశం కలిగినందుకు నాకెంతో ఆనందంగా ఉంది. తెలుగువారి విశ్వచేతనకు అద్దం పట్టే ఈ కృతులు, ఆధునిక భారతీయ సమాజంలో అభ్యుదయ పతాకలుగా మిన్నంటే ప్రతిభామూర్తులలో అగ్రగన్యులైన తెలుగు బిడ్డ ప్రపంచ ప్రసిద్ధ సత్యం కంప్యూటర్స్ సర్వీసెస్ లిమిటెడ్, అధినేత శ్రీ బైర్రాజు రామలింగరాజుగారికి అంకితం చేస్తున్నందుకు నా ఆనందానుభూతి ఇనుమడించింది.

ఈ సందర్భంలో నన్ను ఆహ్వానించిన ఉత్తర అమెరికా మహాసభల కార్యనిర్వాహకు లందరికీ ముఖ్యంగా తానా అధ్యక్షులు శ్రీ నాదెండ్ల గంగాధర్ గారికి, మహాసభల కన్వీనర్ శ్రీ డి. జనార్ధన్‌రావుగారికి, సాహిత్య ఉపసంఘాధ్యక్షులు శ్రీ అప్పా జ్యోస్యుల సత్యనారాయణగారికి నా కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను.

తానా సభల్లో పాల్గొనడానికి నాకు కావాలసిన ఆర్థిక సహాయం అందించిన వదాన్యులు, మాన్యులు సృజనసీలి సత్యం కంప్యూటర్స్ సర్వీసెస్ అధినేత శ్రీ బి. రామలింగరాజు గారికి నేను త్రికరణశుద్ధిగా నేను కృతాజ్ఞాతాభివందనలు తెలియజేస్తున్నాను. వారికీ, వారి కుటంబానికీ సర్వదా శుభంకర సత్య సౌభాగ్య సంపదలు చేకూరాలని ఆకాంక్షిస్తున్నాను. ఈ సందర్భంలో ఆత్మీయులు కవిమిత్రులు శ్రీ మంతెన వెంకట సూర్యనారాయణగారు, సోదరి శ్రీమతి విమలా సయ్యపరాజు గారు నా పట్ల చూపిన సుహృద్భావం సహకారం మరువ లేనివి.

కీ.శే. శ్రీ కురుపోలు నారాయణరెడ్డి గారి సతీమణి శ్రీమతి కొరుపోలు యశోదమ్మ గారు ఈ గ్రంథ ప్రచురణకు ఉదారబుద్ధితో సహాయమందించినందుకు వారికి వారి బంధు మిత్రులందరికీ నా హృదయపూర్వక కృతజ్ఞతలు. మహబూబ్‌నగర్ జిల్లాలోని ఆమంగల్ మండలంలో చేరిన అనుమాస్‌పల్లి వాస్తవ్యులు వితరణశీలి యశోమణి

శ్రీమతి యశోదమ్మ, కొరుపోలు వంశకీర్తి దినదిన ప్రవర్ధమానంగా వెలగాలని ఆశిస్తున్నాను.

నా సాహితీ యాత్రలో నాకు నిరంతరం ఆశీస్సులందిస్తున్న జ్ఞానపీఠ పురస్కార గ్రహీత, ఆంధ్రప్రదేశ్ సాంస్కృతిక మండల అధ్యక్షులు డా. సి. నారాయణ రెడ్డి గారికి ప్రత్యేక కృతజ్ఞతలు తెలుపుతున్నాను. అట్లాగే నా కవిత్వం గురించి నా వ్యక్తిత్వం గురించి నా కంటే ఎక్కువగా అవగాహన కలిగి నన్ను అడుగడుగునా ప్రోత్సహిస్తున్న ఆప్తమిత్రులు జగద్విఖ్యాత సాహితీమూర్తులు ఆచార్య జి.వి. సుబ్రహ్మంగారు ఈ పుస్తక ముద్రణలోకూడా నాకెంతో నైతికబలాన్ని అందించినందుకు నేను సర్వదాకృతజ్ఞుణ్ణి. "మధురానుభూతి" పేరుతో ఈ కావ్యసంపుటికి ఆయన, ధర్మవీరరసతిలకం దిద్దినందుకు నేనెంతో ధన్యుణ్ణి. ఆయన కుటుంబానికి ప్రేమమయ బాబా సత్యసాయి చిన్మయ శేషశాయి కామితార్థములు తీర్చుగాక!

ఇక ఈ గ్రంథం వెలుగుచూడడానికి సర్వాంగసుందరంగా ముస్తాబై ముందుకు రావడానికి తోడ్పడిన బంధుమిత్రులందరికి, అభిమానధనులందరికీ నా శుభాక్షరాంజలి. అగణితమైన నా ఆత్మీయులందరికి ప్రతినిధులవంటి కొందరికి నేను ఈ సందర్భంలో ప్రత్యేకంగా ధన్యవాదాలు తెలియజేస్తున్నాను. డా. నాగభైరవ కోటేశ్వరరావు, డా. ఆచార్య తిరుమల, డా. యమ్. శంకర్ రెడ్డి, డా. కొత్తపల్లి వీరభద్రరావు, డా. గుంటూరు శేషేంద్రశర్మ, శ్రీయుతులు సారిపల్లి కొండలరావు, ఎస్. రాధాస్వామి, అట్లూరి సుబ్బారావు, యం. చిత్తరంజన్, సి. రామకృష్ణ, డి. విఠల్ రావు,. వి. రాజేశ్వరరావు, డి. అదికేశవులు, ఆర్. స్వరూప రెడ్డి, డి. శ్రీనివాసులు, ఐ.ఎ.ఎస్., డా. ఉండేల మాలకొండారెడ్డి. డా. యమ్.ఎస్. రెడ్డి, శ్రీ వి.వి. నారాయణ, డా. బి.యన్. రెడ్డి, శ్రీ ఎ.వి.ఎస్. రాజు, శ్రీ డి. దామోదర్ రెడ్డి (యుఎస్ఎ), శ్రీ విజయ సేనారెడ్డి, శ్రీ ఇలపావులూరి రామమోహన రావు, శ్రీ కొమరయ్య, శ్రీ చెరుకువాడ వెంకటరామయ్య వంటి మహనీయులకు నా ఆత్మీయ అభినందనలు.

నా మనస్సుకు మేధస్సుకు కావలసిన శక్తి సామర్థ్యాలు అందిస్తున్న నా హృదయేశ్వరి రాజేశ్వరి, నా కన్నబిడ్డలు, పౌత్రులు, దౌహిత్రులకు నా అభినందనాశీస్సులు.

ఈ కావ్య మంజరిని సర్వాంగ సుందర రూపంలో ప్రచురించిన జాబిలీ పబ్లికేషన్స్ వారికి, సకాలంలో ముద్రించిన విప్ల కంప్యూటర్ సర్వీసెస్ వారికి నా ప్రశంసాపూర్వక కృతజ్ఞతలు.

జె. బాపురెడ్డి

# మధురానుభూతులు

- ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం

*"ఇతరులు ఏనాటికో గాని తెలిసికో గలిగేవి*
*నాకిప్పుడే అవగత మౌతున్నాయి*
*నేను అసంపూర్ణుణ్ణి కాని*
*లోపభూయిష్ఠుణ్ణి కాదు*
*నన్ను అధిగమించిన ఒకానొక శక్తికి*
*ప్రతినిధిని నేను*
*మనిషికీ దేవుడికీ మధ్య*
*పరిణామం చెందుతున్న ప్రయోగాన్ని నేను" (సృజన శక్తి)*

ఏ కావ్యం రచించినా కవి అందులో ఎక్కడో ఒకచోట తన ఆత్మను దాచిపెడతాడు. దాన్ని పట్టుకుంటే ఆ కావ్య జీవితమంతా అర్థమౌతుంది. పై కవితా పంక్తులు డాక్టరు బాపురెడ్డి కవితకు ఆత్మవంటివి. ఆయన అచ్చంగా అరవిందయోగి వలె మాట్లాడాడు పై కవితలో.

కవిత్వవాణి మన భౌతికం కంటె అతీతమైందీ, మన బుద్ధి శక్తికంటె మించిందీ అయిన ఒక అతీత మానసిక శక్తి నుండి పుడుతుంది. ఆ అతీతమానసికశక్తి వస్తువుల ఆధ్యాత్మిక అస్తిత్వాన్ని విశాలమైన దృష్టితో అంతర్గతమైన సత్యంగా దర్శిస్తుంది. ఆ సత్యప్రకాశమాహాత్మ్యాలను అంతఃప్రేరణనుండి దివ్యభావావేశంతో పుట్టిన భాషలో ఆవిష్కరిస్తుంది. ఆ భాష ఆత్మానందవిభూతిని వ్యక్తం చేసే అంతర్వాణి పలికే శబ్దాలవలన అభివ్యక్తమౌతుంది. ఆ అభివ్యక్తిని మంత్రంతో పోల్చవచ్చు- అన్నారు శ్రీ అరవిందులు. నిజానికిది ఆధునికమైన ఆర్షదర్శనం. అతీంద్రియమైన కవితా సౌందర్యతత్త్వ దర్శనం. శ్రీ అరవిందుల భవిష్య కవిత్వ దృక్పథం.

ఆత్మనుండి సరాసరి ఆవిష్కృతమయ్యేదే అసలైన కవిత్వం అన్నారు శ్రీ అరవిందులు."The true creator of poetry, the true hearer is the Soul". కవిత్వాన్ని నిజంగా సృష్టించేదీ, వినేదీ, ఆస్వాదించేదీ కూడా ఆత్మయే- అన్నది ఆయన కవితా సిద్ధాంతం. వారు సాధించిన పూర్ణయోగం చూపించిన దివ్యజీవన ప్రస్థానం, వారు తథ్యమని ప్రకటించిన అద్భుత, సర్వాతీతమానవోత్తముల జన్మ, వారి దైవ విభూతివలన సృష్టిపరిణామక్రమం త్వరితగతిని ముందుకు సాగుతుందనీ, మానవులు అధిభౌతిక, ఉన్నత స్థితులనే సాధనా శిఖరాలను అధిరోహిస్తారనీ చెప్పిన సత్యాలన్నీ వారి ఆధ్యాత్మిక యోగదర్శనశక్తికి ప్రమాణాలుగా నిలిచాయి.

డా. జె. బాపురెడ్డి గారికి అరవిందులు ఆదర్శమూర్తులుగా దర్శన మిచ్చారు. "అరవిందుల అడుగుజాలు" అనే కవితాఖండిక వ్రాశారు.

*"శ్రీ అరవిందులని అంతర్ జ్ఞానాలోచనల*
*అడుగుజాడలు అగుపించాయి నాకు*
*తీరం లేని నిశ్శబ్ద సైకతాలలో-*
*అవి-మనిషికి అనంతత్వంతో ఉన్న అనన్యత్వాన్ని*
*దైవత్వంతో ఉన్న ఏకత్వాన్ని గుర్తు చేస్తాయి"*

అని స్వయంగా చెప్పుకున్నారు. తెలుగు సాహిత్యంలో ఆధునిక స్ఫూ ఆహధ్యాత్మికత. దానిని చిన్నప్పటి నుంచీ పద్యంలో, గేయంలో, పాటలో, వచనకవితలో ప్రవచిస్తున్న ప్రతిభామూర్తి డా॥ బాపురెడ్డిగారు. ఆధ్యాత్మికత ఆయన కవితకు ఆయుస్సూత్రం, అది ఆయనే అన్నట్లు ఇతరులు ఏనాటికో గాని తెలిసికోగలిగేది.

బాపురెడ్డిగారు వేదాంతికారు, యోగికారు. అయితే తాత్విక వైజ్ఞానిక దర్శనం ఉన్న లౌకికకవి. కస్తూరి కలిపిన బంగరు పాత్ర వంటివారు. అందుకే శుద్ధ లౌకికవాదులన్నా, శుద్ధ వేదాంతులన్నా ఆయన పట్టించుకోరు. ఆయన అనుష్ఠాన వేదాంతాన్ని ఆమోదించే మేధావి. లౌకిక కవులు వట్టి పేరుకోసం ప్రాకులాడుతారు. పేరుకోసం తీరును సైతం మార్చుకుంటారు. వాళ్ళంటే బాపురెడ్డిగారికి వొళ్ళుమంట!

"అప్పుడు/యువకవులు ప్రసిద్ధ కవులను/పట్టిపట్టి అనుకరించేవారు -
ఇప్పుడు/అలసిపోతున్న మహాకవులు/పేరుకోసం/ప్రచారకవులను అనుసరిస్తున్నారు.

అని నిర్మొగమాటంగా చెప్పారు. బాపురెడ్డిగారు అలసి పోయే మహాకవుల జాబితాలో ఎప్పుడూ చేరడు కాబట్టి. ఆధ్యాత్మికత వారి కవితకు అమృతశక్తి.

బాపురెడ్డిగారికి ప్రణయం హృదయం, ప్రగతిమేధ, ఆధ్యాత్మికత ఆంతరచైతన్యం., ప్రణయ కవిత్వంలో భౌతికత, లౌకికత, భావుకత, ప్రతీకాత్మకత, చతురతలను చిత్రిస్తూనే ఆధ్యాత్మికతను స్పృశించిగాని కవితను ముగించరు. మచ్చుకు-'పల్లవి లేని పాట'ఒక ప్రణయగీతం కాని అందులో చతురోక్తులు జీవించాయి. "ఛందస్సువదలని/శాస్త్రీయగేయం లాంటి/ప్రియుని కోసం/అన్వేషిస్తున్న నన్ను/వచన కవిత్వంలా వచ్చి/పట్టుకున్నావు నీవు'- అనే ఎత్తుగడ ఎంత చమత్కారంగా కనపడుతుందో అంత లోతును ప్రదర్శిస్తుంది. కవి ఆత్మకు పట్టుకున్న వచనకవిత పద్య గేయకవిత్వంలో బాపురెడ్డి అన్వేషిస్తున్న ఆధ్యాత్మికతతో యోగం చెందిందని ధ్వని-చివరకా జంట వేపచెట్టు రావిచెట్టుల్లాగానే కాదు, పార్వతీపరమేశ్వరులవలె పరవశించిగాని ఊరుకోరు. అంటే - బాపురెడ్డిగారి కవిత భౌతికంతో ప్రారంభమై, భావుకత్వంలో ఎగసి, ఆధ్యాత్మికత్వంలో అధివసిస్తుందన్న మాట. ఇది అందరికీ అలవడే ప్రస్థానం కాదు. అందుకే బాపురెడ్డి గారు ఒక ప్రత్యేక వ్యక్తిత్వంలో ప్రకాశిస్తుంటారు.

*"చెట్లు పారిపోయాయి! బుల్లెట్ల గర్జనకు*
*పక్షులు నేలకూలిపోయాయి! చెట్లు చెదరిపోయిన అడవుల్లో" (పు. 86)*

ఇది ప్రతీకాకరమైన భావచిత్ర కల్పనాశిల్పం. చెట్లు చెదరిన అడవి నేటి సమాజం. అందులో హింసావాదం సృష్టిస్తున్న సంక్షోభాన్ని అడవి మీదా, చెట్లమీదా ఆరోపించి చెప్పారు.

ఆధునిక అభివ్యక్తికి ఇది చక్కని ఉదాహరణం. ఇటువంటివే 'సంధికుదరని శబ్దాలు' వంటివి కూడా.

"మనిషిని మార్చాలన్న/మహోద్యమాలన్నీ/మట్టిపాలైనాయి
మట్టిలో పుట్టి/మట్టిపాలౌతున్న మనిషి
వట్టి మట్టి మాత్రం కాదని/మానవచరిత్ర చెప్పేపాఠం" (పు.105)

మానవ వికాసాన్ని, మానవమనస్తత్త్వాన్నీ, మానవజీవితతత్వాన్నీ, మానవ జీవన పరమార్థాన్నీ గురించిన నిర్దిష్టమైన అభిప్రాయాలున్న వాడే ఆధునిక కవి. అస్పష్టత అభివ్యక్తిలో ఉంటే సహించవచ్చుకాని, ఆలోచనలో ఉంటే క్షమించరాదు. బాపురెడ్డిగారి కవితలు స్పష్టమైన ఆలోచనలకు ఇష్టమైన కవితాభివ్యక్తులు.

బాపురెడ్డిగారు దేశం నలుమూలలా తిరిగారు, విదేశాలలో విశేషంగా పర్యటించారు. ప్రపంచకవుల సభలలో తెలుగు కవితను వినిపించారు. ప్రపంచభాషలలోని కవితలను తెలుగులోకి తెచ్చారు. తమ కవితలను పాశ్చాత్య భాషల్లోకి పంపారు. ప్రపంచ భాషాసాహిత్యాలతో, ప్రపంచమంతా పరుచుకొని ఉన్న తెలుగు వారితో ఇంత పరిచయమున్న తెలుగుకవి సమకాలీనులలో అరుదు. అందుకే బాపురెడ్డిగారి కవితాసంపుటుల్లో ఇతర దేశాలలో ఆయన చూచి స్పందించిన ఎన్నో అంశాల మీద కవితలుంటాయి. అవన్నీ కలిపి ఒకసంపుటిగా వేస్తే తిరుపతి వెంకటకవుల నానారాజసందర్శనం లాగా, నానా దేశసందర్శనం తయారౌతుంది. కడచిన పదేళ్లుగా దేశాంతరవాసులైన తెలుగువారికి తమ కవితలను అంకితం చేసి, మాతృదేశంతో మాతృభాషతో వారి కున్న మరువలేని సంబంధాన్ని అక్షరానుభూతులుగా చిత్రించటం ఒక స్నేహసంస్కృతిగా పెంపొందిస్తున్నారు బాపురెడ్డి గారు. ఆయన ఆ విధంగా మనకూ ప్రపంచానికీ అక్షరానుభూతుల అనంతవారధి. అందువలన ఆయన ప్రతికావ్యం ఒక మధురానుభూతి.

తమ స్వీయ కవితా సంస్కృతి వ్యక్తిత్వాన్ని, ఈ అక్షరానుభూతునుల ద్వారా మరొకసారి ప్రదర్శించుకొంటున్న మాన్యమిత్రులు, మహాకవులు డాక్టర్ బాపురెడ్డిగారిని మనసారా అభినందిస్తున్నాను. విశ్వాంధ్ర సోదరసోదరీమణులకు నా శుభాకాంక్షలు నందజేస్తున్నాను.

ఈ విశ్వ జనీనమైన కవితల సంపుటి ఉత్తర అమెరికా తెలుగు మహాసభల్లో ఆవిష్కరింపబడటం, విశ్వవిఖ్యాతుడైన పారిశ్రామికవేత్త, ఆధునికయుగచేతనకు ప్రతినిధియైన మేధావి శ్రీ బి. రామలింగరాజుగారికి అంకితం కావటం, ఎంతో ఔచిత్యభరితంగ అభినందనీయంగా ఉంది. కృతికర్తకు, స్వీకర్తకు నా ప్రేమాభిమానాంజలి.

**ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం**
అధ్యక్షులు
ఎస్.వి.ఎస్. సాహితీ కళాపీఠం
హైదరాబాదు

# స్పందన

జీవితానికున్నట్టే కవిత్వానికీ లక్ష్యం ఉండాలి. కవికి ముందు ఏమి రాయాలనే స్పష్టమైన అవగాహన అవసరం. అప్పుడు చూడొచ్చు ఎలా రాయాలో, వస్తువు, అభివ్యక్తి అంటే ఇవే. డా॥ బాపురెడ్డికి తాను ఎన్నుకున్న వస్తువుపట్ల నిర్దిష్టమైన అవగాహన ఉంది. ఆవేశాన్ని ఆలోచననూ రంగరించుకుని అందంగా వ్యక్తీకరించే నేర్పుంది. ప్రథమ రచన 'చైతన్యరేఖలు' నుంచి పరిణతికృతి "శ్రీకారం శిఖరం" వరకు జరిగిన క్రమారోహణలో బాపురెడ్డి ప్రతిభా పరిణామం స్పష్టంగా కనిపిస్తుంది. ద్వంద్వ ప్రవృత్తుల మధ్య నలిగిపోతున్న సత్యాన్ని సందర్శించే సూచీ ముఖం లాంటి సూక్ష్మమతి ఆయనది.

-డా. సి. నారాయణ రెడ్డి

విదేశాలకు వెళ్లే వాళ్ళందరు మొత్తం మీద ఏదో ఒకటి పోగొట్టుకుని వస్తారు. బాపురెడ్డి మాత్రం అక్కడక్కడ అపూర్వ సౌందర్యాలన్నింటినీ మూటకట్టుకుని తెచ్చి, తెలుగు సరస్వతికి అమూల్యాభరణాలుగా కూర్చి తీర్చి దిద్దాడు.

- డాక్టర్ బోయి భీమన్న

బాపురెడ్డి సాహిత్య భాషలో నుంచి పరిమళభరితమైన శబ్దాన్ని ఏరుకోవడంలో గొప్ప ప్రవీణుడు. శబ్దాలు మృదూని కుసుమాదపి. వాటిని పద్యపాదాలుగా అల్లి శ్రోతను సమ్మోహితుడ్ని చేయడంలో అద్వితీయ ఇంద్రజాలికుడు... శ్రీ బాపురెడ్డి తెలుగు సాహిత్యంలో వరణీయ కవుల్లో గణనీయుడు, స్మరణీయుడు అని నిరాఘాటంగా చెప్పవచ్చును.

- డా. గుంటూరు శేషేంద్రశర్మ

మహాకవులెవ్వరూ సమన్వయం చెయ్యని, సందేశం లేని కావ్యాలు వ్రాయలేదు. బాపురెడ్డి గారు తన కవిత్వానికి సమన్వయం ప్రాణంగా చేసుకోగలిగాడు. ఇందువల్లనే ఈయన కవిత్వంలో దేహానికి, మనస్సుకి, బుద్ధికి సముచిత స్థానాలు లభించడమే కాకుండా - చాలా మంది ఆధునిక కవులలో కనబడని అతీంద్రియమైన ఆత్మవస్తువుతో వీటికి సమన్వయం చేసే ప్రయత్నం కనబడుతుంది.

- ఆచార్య కొత్తపల్లి వీరభద్రరావు

డా॥ జె. బాపురెడ్డిగారు సహజ కవులు. నిరంతరాన్వేషకులు. ప్రపంచం నలుమూలలా పర్యటించిన ప్రతిభావంతుడు. అటు వేదాంతాన్ని జీవిత సత్యాలతో వ్యాఖ్యానించే తత్త్వవేత్త. ఇటు తత్వ సాగరాన్ని సౌందర్య బాహువులతో ఈదగలిగిన రసిక వీరులు. అన్ని రసాలూ స్నేహరసంలోనే పుట్టి పెరిగి లయిస్తాయన్న రసరహస్యాన్ని బోధించే దార్శనికుడు.

- ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం

"మీరన్నా మీ కవిత్వమన్నా, నాకు చాలా ఇష్టం. మీ వ్యక్తిత్వం ఎంత నిర్మలంగా, దయాపూరితంగా ఉంటుందో; మీ కవిత్వం, అంత అందంగానూ ఆత్మీయంగానూ ఉంటుంది. దాదాపుగా మీ పుస్తకాలన్నీ నేను చదివాను. విశాలమయిన ఈ దేశంలో, అనంతమయిన కాలంలో, ఈ మీ కావ్యాన్ని, హృదయానికి హత్తుకొని, వొత్తుకొని, ఆనందించే సహృదయులు, తప్పకుండా ఆవిర్భవిస్తారని నేను నమ్ముతున్నాను.

- డా. రావూరి భరద్వాజ

"దశాబ్దాలుగా కవిత్వం వ్రాస్తున్న మధురమైన తెలుగు కవుల్లో బాపురెడ్డిగారు తొలి పంక్తిలో ఉంటారు... బాపురెడ్డిగారికి పద్యాల్లోగానీ, గేయాల్లోగానీ, చివరకు వచనకవితలోగానీ జనరంజకతకు భంజకం కాకుండా రాయాలనే స్పృహ ఉండటంవల్లనే ఆయన రచనలకు ప్రసాదగుణం, ధారాశుద్ధీ అలవడ్డాయి.

**-డాక్టర్ ఎన్. గోపి**

బాపురెడ్డి అంతర్జాతీయకవి. ఈ మాట అలవోకంగా అన్నది కాదు. అతడు 35 దేశాల్లో పర్యటించాడు. అంతకంటే ఎక్కువ సంస్కృతులతో పరిచయ మేర్పరచుకొన్నాడు. అయా భాషా సాహితీకారులతో స్నేహం చేశాడు. వారి కవితలలో కొన్నింటిని తెలుగులోకి తెచ్చాడు. తన కవితలు కొన్నింటిని ప్రపంచ భాషల్లోకి అనువదింపబడే స్థాయికి ఎదిగాడు....
ఇల్లు వదలి పెట్టి బయటకు తొంగిచూడని తెలుగు కవిత్వానికి ఇలాతలతత్వం నేర్పిన కవి బాపురెడ్డి. అందుకని ఆయన తెలుగు కవే కాదు, భారతీయకవే కాదు. అంతర్జాతీయ కవి....
బాపురెడ్డి విలక్షణమైన కవి. ఆయన ఎంత విపులంగా అంతర్జాతీయ పర్యటనలు చేశారో, అంత విస్తారంగానూ కలం సాగించాడు. ప్రధాన కవిత్వ రూపాలైన పద్యం, గేయం, వచన కవిత - మూడింటిలోనూ విశేషకృషి చేశాడు....
వచన కవిత్వం చెప్పడంలో బాపురెడ్డిగారిదొక ప్రత్యేకమైనముద్ర. అలాగే కవిత్వం చదవడంలో కూడా ఆయనదొక ప్రత్యేకవైఖరి. ఈ కవిది సంప్రదాయ బంధంవున్న ఆధునిక తత్వం. ఆధునికతా గంధం ఉన్న సంప్రదాయ సత్వం.
వర్తమానంలో జీవిస్తూ, వర్తమానాన్నే కాకుండా గతాన్ని ఆగతాన్ని సంభావిస్తున్న గొప్ప విజన్ గల కవి బాపురెడ్డి. బహుముఖంగా విస్తరించిన ఆయన ప్రతిభ యువకవులకు ఆదర్శం కావాలి.

**- డా. నాగభైరవ కోటేశ్వర రావు**

కొందరు కేవలం కవులగానే జీవిస్తారు. కవులుగానే రాణిస్తారు. మరికొందరు పరిపాలన చతురులుగా కీర్తి తెచ్చుకుంటారు. పరిపాలన దక్షులు గానే విలక్షణులవుతారు. ఈ రెండు రంగాలకు సంబంధించినంతవరకు బాపురెడ్డి గారు సవ్యసాచిలా కనిపిస్తారు. నిరంతరం చిరంతన దీక్షతో కవి భావుకతలో లగ్నమనస్కుడు అవుతాడు. పరిపాలన రంగంలో పదిమంది విచిత్ర చిత్తవృత్తుల మధ్య, మొరటుదనాలు, కరకుదనాల మధ్య మెలిగే కవి తన భావుకతను కాపాడుకొని, తన భావాలను తానే పాదుకొని కవిగా నిలవడం కష్టం. అయినా మౌలికంగా కవియైన బాపురెడ్డిగారు, కవిగా నిలబడ్డారు. సమున్నత స్థానాన్ని అధిష్ఠించారు. అందుకు మొదట వారిని అభినందించాలి. వారి కవితాశయం రమణీయమూ, కమనీయమూ, స్పృహణీయమూ. బాపురెడ్డిగారు కవిగా, మేధావిగా, దారిచూసే క్రాంతదర్శిగా, మేలుకొలిపే వైతాళికుడుగా, సహృదయులను రంజించే మురళీమూర్తిగా మన ముందు సాగిపోతున్నారు.

**- ఆచార్య ఎల్లూరి శివారెడ్డి**

బాపురెడ్డి కవితలలో కన్పించనిది "హిపోక్రసీ', తాను తలచిన, నమ్మిన అభిప్రాయాలను కవితలుగా మలచటంలో రసరమ్య భావనకు పారదర్శకంగా అందిస్తారు. స్వాదువూ మధురమూ ఆయన బాపురెడ్డి కవితాసవం రసజ్ఞులు ఆస్వాదించదగినది.

**- రామమోహనరామ్**

ఆధునిక తెలుగు సాహిత్య రంగంలో-బాపురెడ్డి గారు నిత్య సాహిత్యోపాసకులై, నిరంతర ప్రయోగ కుశలురై, తమ బహుముఖీన-ప్రజ్ఞాపాటవాల చేత ఒక విశిష్ఠ స్థానా సంపాదించుకున్నారు. ఆయన సాహితీ ప్రస్థానంలో త్రివిధ దర్శనాలున్నాయి. పద్యవిద్యల గేయ నిర్మాణంలో, వచన కవితాభినివేశంలో ఆయన శిఖరాలందు కున్నారు. బాపురెడ్డిగా సమగ్రసాహిత్యాన్ని సమీక్షించి చూస్తే ఆయన్ని జ్ఞానపీఠ బహుమతి కర్హులైన తెలుగు కవు పంక్తిలో నిలబెట్టటానికి నాకేమీ అభ్యంతరం లేదు. ప్రాక్పశ్చిమ సాహిత్య సాగరాల్ని మథించి మంధర మాయస మానసం. అటువంటి మనసు నుండి ఏ భావం ఉదయించినా అ జీవన శ్రుతులనే మీటుతుంది. అనంతానంద సీమలనే అందిస్తుంది.

- డా. ఆచార్య తిరుమ

బాపురెడ్డిలో కవిత గంగై, గోదావరై, నైలువలే రైనువలె ఓల్గామాదిరిగా హుయాంగ్‌హోవ అమజాన్‌వలె అందాలు సంతరించుకున్నది...
మచ్చుకి రెండు వాక్యాలు చెప్పాలంటే "పూల విలువ తెలిసిన పూర్ణస్త్రీ సత్యభామ, పరమాత్మ కాలదన్ని పారిజాతాలను వరించింది." నా జమిందారీ పోకుంటే పై వాక్యాలకు అక్షర లక్ష ఇచ్చేదాన్ని...

- తెన్నేటి హేమల

పద్యమ్ము గద్యమ్ము పదనుగా కదనుగా గుప్పించగల కళాకోందుడు
గేయమ్ము ధ్యేయమ్ము ఖేలాసమమ్ముగా సంధించు, సుకవితా సవ్యసాచి
ప్రణయమ్ము ప్రణవమ్ము పాలుతేనియలుగా కలిపి వడ్డించు ప్రజ్ఞానశాలి
అనుభూతి జనగీతి అసమానరీతి ఆలాపించు గానకళావిదుండు....

- డాక్టర్ ఉండేల మాలకొండా

రంగు రంగుల చీకటి కోటల్లో మహళ్లు కట్టుకుని భద్రంగా బ్రతుకుతున్న వాళ్ల గుండె వెలుతురు కత్తుల్ని గుచ్చి వాళ్ళకుళ్ళుని లోకపు కళ్లకి చూపించాలని నిర్మించిన మీ కవితాస్త్రా నా ధన్యవాదాలు....
మీ ఆంగ్ల కవితల మీద ప్రేమా నందకుమార్ గారు వ్రాసిన విమర్శ చదివి స్పందించావ మీరు లండన్‌లో, హూస్టన్‌లో విడుదల చేసిన మీ కవితా మరకతాలను స్వీకరి ఐశ్వర్యవంతులమయాము.

- డాక్టర్ మీరాఖాన్, (Oegstgeest, Hollar

విశ్వకవుల పరిచయమును విస్తృతముగ పెంచుకొనుచు,
అనుక్షణం ఎదుగుతున్న అవధిలేని రసిపిపాసి
ప్రణయరాగమధురిములను, ప్రణవనాదమందు పొదిగి
సిరితరగని రచనలెన్నొ చేసినట్టి 'సవ్యసాచి'

- సహజ కవి డా. మల్లెమ

"శ్రీ బాపురెడ్డిగారి కవిత్వాన్ని మనం పరిశీలించి చూస్తే ఈయన ప్రత్యేకించి ఏ 'ఇజా కట్టుబడి ఉన్న కవిగా కన్పించరు. ఈయనలో ఉండేది ఒకే 'ఇజం' అది హ్యూమనిటేరియని అభ్యుదయ దృక్పథంతో మానవత్వాన్ని ఊతగా గొని గమ్యం వైపుకు నడిచిపోతున్న క బాపురెడ్డిది. నిర్మూలనకంటె నిర్మాణం, సాయుధ విప్లవం కంటే సాంఘిక వికాసం - ఆయన ధ్యేయాలు.'

- డాక్టర్ రావి భా

# ఇందులో . . .

# ప్రకృతి వ్రాసిన కావ్యాలు

చెట్లు
ప్రకృతి వ్రాసుకుంటున్న కావ్యాల్లాగ
పరిమళిస్తున్నాయి
వాటి శిరస్సుల్లో చివురించే భావాలు
మాడిపోయే మట్టిమీద
మమతల నీడలు కురిపిస్తున్నాయి -

వాటి ఒళ్లల్లో నిదురించే కలలు
ఫలాలుగా మేల్కొని
ఆ కొన్న ప్రాణి కోటికి
ఆహారమై తరిస్తున్నాయి.

కనిపించని భగవంతుని
కారుణ్యాన్ని
చెట్ల మోములమీద
చిత్రిస్తున్నది ప్రకృతి
వసంతాల కుంచెలతో
వేదాంతాల రంగులతో -
కొమ్మల మీద రెమ్మల మీద
కూర్మిసంతకం చేస్తున్నది
భక్తి పూల కలంతో -
శక్తి శాలి సిరాతో -

గాలి ఒడిలో
గంధాలు నింపుతున్నాయి తోటలు
ఎంత ఇచ్చినా తరగని స్నేహపరిమళం
పూలగుండెలది
ఎంత మోసినా తనివితీరని
రాగబంధం పవనాలది
బండరాళ్లను, సెలయేళ్లను
కనిపెంచిన ప్రేమమూర్తులు
కొండకోనలు -

ఖేచరాలను, భూచరాలను
కళ్లకద్దుకొనే
కరుణామయులు చెట్టు చేమలు
స్వార్థ పూరిత మానవలోకానికి
సహనహీనతత్వసమాజానికి
సహజీవన పాఠం బోధిస్తున్న దేమో ప్రకృతి
చెట్ల గీతాలతో
పూలరాగాలతో.

# విక్రమ వసంతం

నుదుటి మీద
నూతన శతాబ్ది తిలకం
మెడలో నవసహస్రాబ్దిమాల
విచ్చేసింది విక్రమ వసంతం
నింగినుండి నేలకు
కలలు కన్న కాలం కంటిలోకి
మామూలు మనిషి ఇంటిలోకి -

కోకిలలు పాడుతున్నాయి
క్రొంగొత్తపాటలు
భాష, భావం, బాణీలు మార్చి
ఆవేశంతో ఆలపిస్తున్నాయి
ఆలోచనా గీతాలు -
ఈ వింత వసంతవిరాట్టును
ఎలా వర్ణించాలో తెలియక
కవులు కంప్యూటర్లను ఆశ్రయిస్తున్నారు
నిలకడలేని ప్రాపంచిక జీవితాన్ని
నిర్దేశించడానికి
"పంచాంగాలు" చాలవని
పండితులు కలవర పడుతున్నారు
కల్లిబొల్లి కబుర్లు చెప్పిన రాజకీయాలు
అల్లిబిల్లిగా అల్లుక పోతున్నాయి
హితాలు వల్లించిన మతాలు
ఇటూ అటూ ఊగులాడుతున్నాయి

రాద్ధాంతాలు చేసిన సిద్ధాంతాలు
తీర్పులేని సందేహాల
గందర గోళంలో పడ్డాయి
నిజాలు తెలుసుకోలేని ఇజాలు
భుజాలు తడుముకుంటున్నాయి

"అనంతం" అంటే ఎంతో తెలుసుకోవాలని
సౌరమండల శూన్యాన్వేషణ
అంతరిక్షపు ఆవులింత
కాంతివేగపు కలవరింత

భాషలు ప్రసవించిన పరిభాషలు
భావాలు కల్పించిన ప్రతీకలు
అందాలు పోషించిన అలంకారాలు
సత్యాలు రంగరించిన సామెతలు
కోటికోటి పడగలు విప్పిన
నేటి విశ్వరూపాన్ని
నిర్వచించలేక, నిరూపించలేక
నివ్వెర పోతున్నాయి
నిట్టూరుస్తున్నాయి
పండుగ చేసుకోవలసిన
ఉగాది
సత్యాసత్య విచికిత్సలో
ఆత్మానాత్మ వివేచనలో పడి
ప్రశ్నార్థకమైపోతున్నది.

# నవయుగ కర్త కంప్యూటర్

మానవ మేధస్సు
తనను తానే సృష్టించుకున్న
మహాద్భుతం కంప్యూటర్
మానవసేవకు అంకితమైన
మానవుని యజమానిగా మారిన
రాజనీతివిశారద కంప్యూటర్

సృష్టికి ప్రతి సృష్టిగా
దృశ్యా దృశ్య స్రష్టగా
దేశకాలాల కరదీపికగా
వెలిగిపోతున్న వింతలలో వింత
సైబర్ జగత్ కంప్యూటరీకాంత

వాయు పుత్రుని రామభక్తి
వసుధనేలే దైవశక్తి అయినట్లే
'మానసపుత్రి' కంప్యూటర్
మానవవాభ్యుదయాసక్తే
తన దివ్య ధీశక్తి అయింది
ఇది కలియుగం కాదు,
'కంప్యూటర్ యుగం' అని
నిరూపించింది

వెండితెరమీద ప్రదర్శించే
ఛాయాచిత్రం కాదు

బుల్లి తెరమీద దర్శనమిచ్చే
వాస్తవ విజ్ఞాన నేత్రం అది

పటుతరమైన ప్రశ్నలకు
చిటికలో జవాబు చెపుతుంది
లెక్కలంటే లెక్కేలేదు
అంకెల మర్మం తెలిసిన
జ్యోతిష్య జ్యోతి అది -

భాష ఏదైనా సరే
తన భాషగా మార్చుకుంటుంది
"ఇంటర్‌నెట్" అనే ఇంద్రజాలంతో
ఇంటింటికి, కంటికంటికి
ఏకకాలంలో లోక మంతటికీ
ఏ సమాచరమైన అందిస్తుంది -

కాంతి వేగంతో పయనిస్తూ
భౌతిక సత్యాలకూ
భావ సత్యాలకూ
అను సంధానం కల్పిస్తుంది.
కంప్యూటరి ప్రతిభాపాటవాలకు పరిమితుల్లేవు
అభిరుచులకు అడ్డులేదు
ఒయ్యారాలకు, ఉపాయాలకు
ఊహలకు, వ్యూహలకు, ఊరట లేదు.

## అక్షరానుభూతులు

కొట్టు కొట్టులో కూర్చుంది
క్రయ విక్రయాలు చేస్తుంది
మారు మూల గదిలో నుండి
కోటి కోటి చిక్కుల్ని
కొనగోటితో విడమరుస్తుంది.

ఆఫీసుల్లో తిష్టవేసి
అధికారం చెలాయిస్తుంది
ఇక్కట్లు లేకుండా
ప్రయాణీకులందరికి
టిక్కెట్లు అందిస్తుంది.
ఏ రంగంలో కాలుపెడితే
ఆ రంగం అంతు తేలుస్తుంది
ప్రయోగశీలి- ప్రయోజనకారి కంప్యూటర్ -

తప్పులు చేస్తే ఒప్పుకోదు
చేత కాదని తప్పు కోదు
నిద్రాహారలు విడనాడి
అహూరాత్రులు శ్రమించే
'అనిమిషత్వం' దానిది - అమాయకత్వం దానిది
అక్షర సత్యం దానిది -
"సత్యం" దాని ఇంటిపేరు
సాహసం దాని ఊరుపేరు
సకల లోక కల్యాణం
దాని బ్రతుకు తీరం

దురుపయోగం చేసి
అపురూప శక్తుల్ని దూరం చేసుకున్నాం
సదుపయోగం చేసుకొని
కంప్యూటర్ సిరులను
మానవత్వానికి చేరువచేద్దాం
నేరప్రవృత్తిని శిక్షించే
నిర్మాణాత్మక విలువల్ని రక్షించే
సత్యధర్మావతారంగా బావించి ఆరాధిద్దాం

సాఫ్ట్వేర్-హార్డ్వేర్ దేహాత్మలుగా
ఆకాశంలో ఎగురుతూ
విమానాల్ని నడుపుతుంది
రాకెట్లతో ఆడుకుంటూ
అంతరిక్షాన్ని శోధిస్తుంది
అనుకున్నదల్లా సాధిస్తుంది-
అనుపమాన కంప్యూటర్
నవయుగకర వాణి
కంప్యూటర్‌పాణి.

# తెలుగు తన్వి!

ఒక పాప పుట్టింది
ఒక క్రొత్త చూపుపుట్టింది
స్వదేశం విడిచి వెళ్ళిన ప్రవాసదంపతుల
విదేశ వాసంలో
విజ్ఞాన కళామయిగా పుట్టింది
పాపంటే పాపకాదు
అమెరికాలో భారతాత్మ
వెలిగించిన నవశతాబ్ది నక్షత్రం
కాలం పడుపులోని
కరుడు గట్టిన భావియుగాలకు
దూసుకపోయే తెలుగు వెలుగు వెల్లువ స్రోతస్విని!

బాలాజీ శ్రీనివాసుని ఆరాధించే
భారతీయ సంస్కృతిని
అమెరికా అద్దంలో చూపిన
సనాతన అధునాతని
సామాన్యులు, మాన్యులూ మెచ్చిన
సహజ సుందర రూపగుణ తన్వి
మానవత్వ ప్రగతి తత్వ గంధర్వి -

తూర్పు పడమరలను కలిపే
"నేర్పు" వంతెన వలె
సుషమ వర్ణ సహజీవన హరవిల్లువలె

భాసిల్లే జ్ఞానేశ్వరి
ఈ భాధల్ని రూపుమాపు
అజ్ఞానాంధకారిన్ని ఎడబాపు
లలితామృత తేజస్విని

కళ్లల్లో కరుణరసం
పెదవులపై శాంతరసం
ఒళ్లంతా వీర రసం
కందళించు ఆకుదుమును
దీపించే ఆ పాపను
దీవించింది బంధు మిత్రుల
రసానందం
గోదావరి కృష్ణ గంగాత్మా నాద గోవిందం -

నవభావ సరోవరంలో
ఓలలాడే ఈ రాజహంసను
ఖండఖండాలకు, దూరతీరాలకు
నవసహస్రాబ్ది శాంతి సందేశం
అందించే ఈ శ్వేత కపోతికని
దేశకాలాలు
పులకించేటట్లు
శంఖమొత్తి స్వాగతించండి!

# అరవిందుల అడుగుజాడలు

శ్రీ అరవిందుల "దివ్య జీవితం"
మృత్యువుతో సాగించిన సంభాషణలో
మనః పరిమితులను అధిగమించే
మహత్తర మానవ హక్కును నిరూపించింది

అతని పావిత్రక స్ఫూర్తి
నా విముక్త మేధాశక్తిని
అనాలోచిత సాహస కృత్యానికి పురిరగొల్పింది
ఊపిరాడని నా ఇంద్రియాలను
నా కతీతమైన అనంత అవిశ్రాంత
అంతరిక్ష చేతనలోముంచెత్తింది -

పరిభ్రమిస్తూ, ఊర్ధ్వ ముఖంగా వికసిస్తూ
ఆలోచిస్తూ, దర్శిస్తూ, అంతర్ముఖంగా అన్వేషిస్తూ
రూపాంతరం చెందుతూ, అడ్డంకులు అధిగమించే
మనిషి పట్ల ఆయనకున్న ప్రేమను
ఆరాధిస్తాను

భౌతికభారాలను, అలసతను లెక్కచేయకుండా
ఆయన చే పట్టిన
భావ సీమల్లోకి చొచ్చుకుపోయే
కలాన్ని కళ్లకద్దుకుంటాను
శోభించే అతని కలం నుంచి వెలువడ్డ
సత్యవాక్కులు ప్రసరించే
అంతర్ జ్ఞాన కాంతిరేఖ వెంట సాగుతూ
తళతళలాడే నక్షత్రాల నిగూఢ బ్రహ్మలిపికి

తాత్పర్యం తెలిసికొంటూ
నిబిడాంధకార బంధుర
యదార్థావరణం వైపు పయనించాను
అతి విశిష్ట వ్యక్తిని స్వాగతించడం కోసం
అరుణారుణ కంబళి పరుస్తుంటే
కలల అలలపై పయనించే అతనికళ్లముందు
భవిష్యత్తు పొరలు విప్పుకుంది

అతని కరుణామయ ముఖం మీద దివ్య హాసం వెలిగింది
మానవుని జన్మభూమిని
దృష్టిమాంద్య దూళిలో కప్పివేసిన
విధివిలాసాన్ని వివేచించింది
ఎగసిపోయే ఆయన శిరస్సుమీద
అనంత అ ప్రమేయ విశ్వాంతరాళాలకు
తెరచుకున్న పరమ సూక్ష్మరంధ్రాలలోకి
తొంగి చూశాయి.
రాకెట్టులా దూసుకుపోయే నా చూపులతో
ఆకాశాన్ని అవలోకిస్తుంటే
శ్రీ అరవిందుని అంతర్ జ్ఞానాలోచనల
అడుగుజాడలు అగుపించాయి నాకు
తీరంలేని నిశ్శబ్ద సైకతాలలో -

అవి, మనిషికి అనంతతంత్వంతో ఉన్న అనన్యత్వాన్ని
దైవత్వంలో ఉన్న ఏకత్వాన్ని గుర్తు చేశాయి.

*(శ్రీ అరవిందుల దివ్య స్మృతిలో స్వీయాంగ్ల మూలానికి అనువాదం)*

# ఎవరు నీవు ?

ఎవరు నీవు ?
ఆపాదమస్తకం
అందాలు విరిసిన నీవు
పరవశించిన నా చూపుల్ని పట్టుకొని
నాగుండెలోకి దిగి పోయావు !
నా పంచేంద్రియాలకు పట్టుపడని
ప్రాభవం నీవు
నా భాషను మార్చేస్తున్న భావం నీవు
నా ఊహల్ని ఉక్కిరి బిక్కిరి చేస్తున్న
వాస్తవం నీవు !
అంతులేని నా అనుమానాలకు
అడ్డులేని సమాధానం నీవు !
ఇన్నాళ్ళు నేను కట్టుకున్న
అహంకారాల కోటను
బద్దలు కొడుతున్న బాలహేలవు నీవు !
నా బ్రతుకు ముంగిట నిలిపిన
స్వప్నాల పల్లకిలో
పచ్చికూర్చున్న సుముహూర్తానివి నీవు !
నా భూలోక యాత్రలన్నీ
నీ పద విన్యాసంలో విలీనం చేసిన
కవితా కళాకేళివి నీవు !
నేను నేర్చిన చదువులూ, శాస్త్రాలూ
నీ నిటూర్పుతో ఊడ్చివేసిన
నిరామయ శక్తి నీవు !

ఇహపర సౌఖ్యాలను
నా సుప్త చేతనలో నాటుతున్న
రసానంద పాణివి నీవు !
అమృత ఋతురాణివి నీవు !

మాయా జాలంలో చిక్కుకున్న కాలానికి
మార్గం చూపే వివేక విక్రమం నీవు
కొమ్మచాటు కోకిలత్వానివి నీవు !
నా దేహాత్మల సమైక్య సమతా యజ్ఞఫలంగా
సాక్షాత్కరించిన సత్యానివి నీవు !
నేను సాధించిన మిథ్యా విజయాలను
నన్ను వేధించిన అహంభావాలను
మరిపించే మహానుభూతివి నీవు
స్వేచ్ఛావన చైత్ర గీతివి, నీవు
శిశిరభయం లేని వసంతానివి నీవు
నిర్వచింపరాని నిజానివి నీవు
కాదంటావా !
మరి ఎవరు నీవు !

# ప్రణయ లీల

గాండీవం లాంటి
నీ బాహువుల్లో
శరంలా బిగించావు నన్ను
విడువకు విడువకు స్వామీ !
ప్రణయ లోకాలు
బ్రద్దలైపోతాయి -

పూర్ణబింబంలా ముడిచిన
నీ పెదవులతో
శంఖంలా నన్ను పూరిస్తున్నావు
వదలకు వదలకు నాథా !
సృష్టి అంతా శూన్యమైపోతుంది -

నీ నఖ విన్యాస విలాస క్రీడలో
నక్షత్రాలు మొలుస్తున్నాయి
నా ఆర్జవ శరీర క్షేత్రంలో -
ఆపకు ఆపకు ప్రియతమా !
అంధకారం అలుముకుంటుంది -

నా స్వప్నాల పూలడోలికలో
సత్యమవై ఊగుతున్నావు
విశ్రమించకు ఆత్మసఖా !
కాలగతి ఆగిపోతుంది.

జె. బాపురెడ్డి

# సృష్టి రహస్యం

నీ శూన్యోదరాకాశం చుట్టూ
నా సుదీర్ఘ బాహువుల్ని చుట్టి
సృష్టి రహస్యాన్ని శోధిస్తున్నాను
ఈ కొండలు, కోనలు, మబ్బులు
ఈ మెరుపులు, ఉరుములు, జల్లులు
ఈ వంపులు, సొంపులు, ముంపులు
మలయ మారుతాలు, విలయఘాతాలు
గురుత్వాకర్షణ, విభిన్న తత్వ ఘర్షణ
నీ సత్య సౌందర్య ప్రకృతికి
నీడలుగా, జాడలుగా భావిస్తున్నాను
సృష్టి రహస్యాన్ని శోధిస్తున్నాను -

నా కౌగిటిలో ఒదిగిన నిన్ను
కలగా చూస్తున్నాను
నీ సరస సంకేతాలకు అర్థం తెలియక
నేను సాధించిన విజయానికి
విలువ కట్టలేక పోతున్నాను
సృష్టి రహస్యాన్ని శోధిస్తున్నాను -

రసావతార మూర్తివైన నీవు
రసోహం అనుకునే నాకు
ఇంకా రహస్యంగానే ఉన్నావు
నీ పొందులో నేను పొందే ఆనందం
నిజమో మాయో తెలియని
సందేహావస్థలోనే ఉన్నాను
సృష్టిరహస్యాన్ని శోధిస్తున్నాను -

# ఏడుకొండల రేడు

కొండమీద కొండ ప్రాకుతూ
ఏడుకొండలు
అంతుచిక్కని నీలాకాశాన్ని
అందుకున్నాయి
చుట్టూ చుక్కలు కాపలా కాస్తున్న
రహస్య కుహరాలలో
తిష్ఠవేసిన పరమేష్టిని
అమాంతం ఎత్తుకొనివచ్చి
కరుడుకట్టిన కాల శిలారూపంగా
మారు వేషం వేయించి
భూలోక మందిరంలో ప్రతిష్ఠించాయి
మానవ కళ్యాణం కోసం -

చిరునవ్వులు చిందుతూ
వెలుగు చూపులు రువ్వుతూ
అభయహస్తముద్రలతో
ఆ, మౌనమంగళ విగ్రహమూర్తి
సంక్షుభితాత్ముల
ఆవేదనలను
భవభయ పూరితుల
నివేదనలను
నిగ్రహంతో ఆలకిస్తుంటాడు -

**జె. బాపురెడ్డి**

అతని సాంద్రనీల దేహంలో
నిబిడీకృతమైన
అప్రమేయ అంధకారాన్ని
అతని అపరిమిత దయాదాక్షిణ్యాలు
ప్రజ్వలింప జేస్తుంటాయి

సప్తగిరిశిఖరాల మీద
భూలోకానికి కొని తెచ్చిన
స్వర్లోకం ప్రతిష్ఠితమై ఉంది
చిదానందాత్మల
సనాతన సృష్టిమూల ఓంకార నాదాలు
బ్రహ్మాండమైన కాలచక్రాలు సారించే
జీవన్ముక్తిదాయక సంగీత ధునులు
పవిత్రమైన ఆ పర్వతాంతరాళాల్లో
నిరంతరం ప్రతిధ్వనిస్తున్నాయి
సత్యఝురులై ప్రవహిస్తున్నాయి.

# నిరీక్షణ

నేను ప్రతిరోజూ
నా గూటి నుంచి ఒక శ్మశానవాటిదాక
పడమటి నుంచి తూర్పుకు
నడిచి పోతూ ఉంటాను
అటూ ఇటూ తిరిగే నా కాళ్లక్రింద
ఆరు కిలో మీటర్ల త్రోవ
రోజూ నలుగుతూనే ఉంటుంది -
నా ఒంటి ఆరోగ్యం కోసం
డాక్టరు విధించిన వ్యాయామం, నడక
అయితే, నా శరీరయానం
ఆత్మ జ్ఞానాయనంగా పరివర్తనం చెందుతున్నది -

ఇప్పుడు నాచింతన జీవించడానికి కాదు
మరణించడానికి యోగ్యత గురించి ;
డాక్టరైతే నా నడక బ్రతకడానికి తగిన
ఆరోగ్యం ఇచ్చినట్లు ధృవీకరిస్తున్నాడు
కాని, సత్య దర్శినియైన శ్మశానవాణి
నా డోలాయమానమైన సంశయాత్మతో
గుసగుసలాడుతున్నది -

"బాబూ! నీవు నిష్క్రమించి
సుదూర ప్రస్థానం చేయడానికి కావలసిన అర్హత
నీకింకా అబ్బలేదు" అని గోప్యంగా చెపుతున్నది

భూగోళం
నా పాదాల క్రింద పడమటి నుంచి తూర్పుకు
పరిభ్రమిస్తున్నట్లు గమనించాను
దాని పరుగు తన ప్రాణం నిలబెట్టుకోవడానికి
పాల్పడిన ఒక భయవిహ్వల
సాహసకృత్యమని గ్రహించాను -

అయితే,
దారి వెంబడి మైదానాలలో
ఎత్తు పల్లాల మీద తిష్ఠవేసిన మూగశిలలు
సంభ్రమాశ్చర్యాలతో కనిపెడుతున్నాయి
నా డస్సిన కాలినడకలను -

నేలకు అతక్కుపోయిన చెట్లు
అంతుపట్టని ఆకాశం వైపు తలలెత్తుతున్నాయి
వాటి గతి ఏమౌతుందో
తెలిసకోవడానికి అన్నట్లు -

కొమ్మలమీద అటూ ఇటూ దూకులాడే పక్షులు
చిగురు టాకులను, చితికి పోయే పండుటాకులను
లెక్కబెడుతున్నట్లున్నాయి
కాలక్షేపం కోసం - విసుగు విరామం కోసం -

చరాచరాలన్నీ నిరీక్షిస్తున్నట్లున్నాయి
అనూహ్యమైన వాటి ఆఖరు క్షణం కోసం
అనివార్యమైన
శ్మశాన గర్భ ప్రవేశం కోసం.

# నా జన్మభూమి ప్రశాంతి

ఉవ్వెత్తున ఆకాశంలో ఎగురుతూ
రెక్కలొచ్చిన మేఘాలు
ఊరించే దివ్యలోకాలను కాదని
నేల తల్లి మమతల ఒడిలో వ్రాలి
నిలువున కరిగి పోతాయి -

భూగోళపు పవిత్రతను, ప్రాముఖ్యతను
చాటే కేతనాలు, నీరదాలు
లెక్కలేని జీవన రూపాలెత్తే
మట్టి మంత్రశక్తిని
గుర్తించే ! నిరూపించే చేతనాలవి -

ఈ లోకం వంటి మరో లోకం
ఎక్కడుందో చూపండి !
ఇక్కడ
చీమ-సింహం
ప్రేమ పూర్వకంగా పలకరించుకుంటాయి
భూఖండాలు జలఖండాలు కలిసి
నిరంతర చంక్రమణంలో
కలలు కంటాయి,
సృష్టిని గూర్చి, ప్రతి సృష్టిని గూర్చి
ప్రాభవం గూర్చి, పారంపర్యాల గూర్చి
ఉదయాస్తమానాలు - కలిమిలేములు
చెట్టుచీమలు - పశుపక్షులు
చరా చరాలు
చిరా చిరాలు
కష్ట సుఖాల గూర్చి

జీవన్మరణాల జంఝూటనం గూర్చి
యోగ ప్రయోగాలు చేస్తాయి

ఇక్కడ,
కనిపించే మనిషి
తనశక్తి సామర్థ్యాలు
కనుపించని దైవానుగ్రహాలేనని
భక్తి ప్రపత్తులు ప్రదర్శిస్తాడు
తనజయాపజయాలను
దృష్టాదృష్టాలకు ఆపాదిస్తాడు
ఇక్కడ,
వాయువు
అంతరిక్షాంతర నాదాలను
పరిపూర్ణ నిశ్శబ్దతకు
ప్రసాదిస్తుంది -

అందుకే,
చక్కగా చెక్కిన జీవితాల
వంపుసొంపుల వైభవాలను
భగ్నం చేయకండి
భూమాత జీవిత పర్యావరణంలో
దివ్యలోకాలు
చిరునవ్వుల్ని నింపనీయండి -
క్షణభంగురమైన మబ్బులవోలె
మనిషి - దేవుడు కూడి
పసిపాపల మురిపాలతో
విశ్వంభర గుండెకు
హత్తుక పోనీయండి !

# అక్షరమైన క్షణికానుభూతి

ఆమెరసార్ద్రమైన హృదయ కవాటాలను
నా కలం తట్టగానే
కవితలు దొరలి పడ్డాయి
ఆమె నేత్రాల దేదీప్యతను
నా చూపులు గిలకరించగానే
సత్యాలు ఒలికి పడ్డాయి
నా కలలు ఆమెను ఆశ్రయించగానే
నా శక్తి సామర్థ్యాల పరిమితులు
పటాపంచలైనాయి
అప్పుడు
ఆమె చీకటి తెరలను చీల్చుకుంటూ
నా జీవితంలో అడుగుపెట్టింది
నన్ను వెంటాడిన భయభ్రాంతుల నుంచి
నన్ను రక్షించింది -
ముక్కలు చెక్కలైపోయిన నా ఆలోచనల్ని
ఏర్చికూర్చి
అనుక్రమ రూపసుందర దర్శనంగా తీర్చింది
చెల్లాచెదరైన నా అనుభూతులను
చేరదీసి ధైర్యంపోసి
కార్యదీక్షాస్త్రంగా మలచింది -
ఆమె అంతరాంతరాళాలలోనికి
నన్ను పిల్చుకొని
పరమానంద పరిమళాలుగా

జె. బాపురెడ్డి

ఊపిరి విడిచింది
నా అదృశ్యాత్మను
తన సదృశ్య దేహంతో కౌగలించింది
చుట్టలు కట్టిన నా వయస్సును
బుసకొట్టే వర్చస్సుగా జాగృతం చేసింది -
ఆమె విద్యుద్వీక్షణాలతో
నా కనులు మోడ్పించి
అత్యద్భుతావహ అనాది మూలాంధకార
సౌందర్య దర్శనం చేయించింది
కాలం రాల్చే నక్షత్రమణి పూసలతో
నన్ను హారంగా గ్రుచ్చి
శాశ్వతో పరి నిశ్శబ్ద పీఠస్థితి
అమృతత్వ కంఠంలో వేసింది

# అర్థంకాని ప్రశ్నలు

నాలోని అమాయకబాల్య జిజ్ఞాసతో
నిరంతరం ప్రశ్నించే ప్రశ్నను
పశ్నల్లాంటి ప్రశ్నలడుగుతూన్నాను

భూతకాలం పెరిగినట్టా !
భావికాలం తరిగినట్టా !
కొత్త సంవత్సరం రావటం అంటే
ఏమిటి జరినట్టు ?

సృష్టి జీవిత ప్రాంగణం నుండి
ఊడ్చివేయబడుతున్న
ఈ అబ్దాలు, దశాబ్దాలు,
శతాబ్దాలు, యుగాలు
ఎక్కడ పూడ్చివేయబడుతున్నాయి ?

అంతంలేని "కాలం"
అఖండధారంగా, అయాచితంగా
తనను త్రాగేస్తున్న "దేశం" దోసిటిలోకి
ఎక్కడ నుంచి దొరలి పడుతున్నది ?

వచ్చిపోయే సంవత్సరాలు
ఎక్కడినుంచి వస్తున్నాయో
ఎక్కడికి పోతున్నాయో
ఎవరికైనా తెలుసేమోనని

జె. బాపురెడ్డి

ఇప్పుడిప్పుడే "అక్షరాభ్యాసం" చేస్తున్న
ఈ అర్భకు డడుగుతున్న ప్రశ్నలివి -

అర్థం కాకపోయినా
అడగటం తప్పుకాదని అడుగుతున్నాను
తినగా తినగా వేము
తియ్యనవుతుందన్నారు గదా !
అడుగుతుంటే అడుగుతుంటే
ప్రశ్నల అర్థం తెలుస్తుందని
ఆరాట పడుతున్నాను -
ప్రత్యుత్తరం దొరక్కపోయినా
కనీసం ప్రశ్నఅయినా
సరిగ్గా వేయటానికి
ప్రయత్నిస్తున్నాను.

# బ్యాంగ్‌కాక్‌లో బుద్ధుడు

కామనలు విరబూచే
కర్మభూమి "థాయిలండు"
అది తన "చావొప్రియా" ఝురీతరంగాల మీద
పవిత్ర చతుస్సత్య మంత్రాలను
అష్టధర్మమార్గ భక్తి గీతాలను
ఆలపిస్తూంది -
శతాబ్దాలు, సహస్రాబ్దాలు శ్రద్ధగా వింటున్న
ప్రేమ-శాంతి సందేశం ఇది -

"గాఢవాంచా ప్రేరితమైన
అనివార్యభాధల నిర్మూలనార్థం
అనుసరించవలసిన అష్టసూత్ర మార్గం -
సరియైన అవగాహన - సరియైన ఆశయం
సరియైన వాక్కు - సరియైన ప్రవర్తన
సరియైన వృత్తి - సరియైన ప్రయత్నం
సరియైన జాగృతి - సరియైన ఏకాగ్రత"
బుద్ధుని మార్గదర్శక ప్రభాసము
ఈ ప్రబుద్ధ భూమినించే వెలువడి
భౌతిక ప్రపంచ మంతటా
పరివ్యాప్త మైంది -

"మరకత బుద్ధుడు"
ప్రశాంతిని, ప్రసన్నతను ప్రదీపిస్తున్నాడు -

బుద్ధం శరణం గచ్ఛామి !
"సువర్ణ బుద్ధుడు"
సమతాసత్య తత్వాలను ప్రసరిస్తున్నాడు
సంఘం శరణం గచ్ఛామి !

సుఖవిముఖ నిరీహాత్మ
దాని అత్యాశాపూర్ణ దేహం
సమన్వయం చెందాయి
'తెరవాద' మహాయాన బౌద్ధంలో

అత్యాశలు వదలుకో
అత్యవసరాలు తీర్చుకో
మోహాన్ని మచ్చిక చేసుకో
మోక్షాన్ని అన్వేషించు
అంటూ ఘోషించే
హిందూ మహాసముద్ర సంతానమైన
పచ్చని "థాయిసీమ"ను
అక్కడ సమావేశమైన
ప్రపంచకవులు ముద్దాడినారు

రుజా, జరా మరణ రహితమైన
సద్గుణ సత్యకాలాన్ని గూర్చి
ఆనంద తన్మయత్వంలో కలలు కంటున్న
పరిణామశీలమకుట ధారియని
బుద్ధదేవుని కొనియాడారు

అక్షయ ప్రేమ బిక్షా పాత్రనుంచి
ప్రచలితమయ్యే ఒక కాంతి కణంలో
కరుడుకట్టిన చీకట్లను కరిగించివేస్తూ
తృతీయ సహస్రాబ్దికి
నూతన ఆలోచనల మహెూదయాన్ని
చాటించే
కాలఘంటారావాన్ని వింటూ
కరిగిపోయారు కవి ఋషులు.

జె. బాపురెడ్డి

# కన్నీటి కానుక

మృత్యువు ఎంత భయంకరమైందో
ఇప్పుడు తెలిసింది
నా చిరునవ్వుల్ని చింపి పారేసి
నా పలుకు చిలుక గొంతులో
మూగరాగం నింపేసి
నన్ను కన్నీటి మడుగులో ముంచేసి
నా గుండెలో గూడుకట్టుకున్న నిన్ను
శవం చేసి శ్మశానానికి తీసుకపోయిన మృత్యువు
ఎంత భయంకరమైందో తెలిసింది -

కారులో ప్రయాణం చేసే నిన్ను
విమానాల్లో విహరించే నిన్ను
చేతికర్రకు నడకనేర్పిన నిన్ను
కాళ్లు చేతులు కట్టేసి
కాటికి ఎత్తుక పోయిన మరణం
ఎంత దారుణమైందో
మతిపోయిన నాకు తెలిసింది -
కల్లా కపటం ఎరుగని బాల్యం
శ్రీకారం చుట్టిన మన స్నేహం
ఆత్మీయతలు పూచి, ఆనందాలు కాచి
ఎన్ని వసంతాలకు వన్నె పెట్టిందో
ఎన్ని అనుభూతుల్ని పంచిపెట్టిందో
నెమరు వేసింది నా కన్నీరు
బొటబొట కారిపోయిన

నా తత్వచింతనల మిన్నేరు -
త్వమేవాహంగా
కలిసిపోయిన మనజీవితాలు
అద్వైతంగానే అంతరిస్తాయని
కన్న కలలు కల్లలైనాయి
నీవు - నేను విడిపోతామని
'చావు' పెట్టిన భయాలు నిజమైనాయి -

కాలేజీ విద్యార్థులుగా
ఖాళీ జేబులతో
"రామకృష్ణ" హోటల్లో మనం చిక్కుకున్న
"టిపిన్ బిల్లు చెల్లింపు" ప్రహసనం
తరచుగా తలచుకొంటూ
నవ్వుల జల్లులు కురిసిన నీనారదాలం మనం -

"భీమునిపట్నం" బీచిలో
అంతస్తుల దుస్తులు తీసివేసి
కడలి అలల అఖాతంలో
పరవసించిన పసివాళ్లం మనం -
శ్రీశైలం శిఖరాలను దర్శిస్తూ
కృష్ణా గంగా గానంలో పులకిస్తూ
ప్రకృతి గృహంలో అతిథులమై
పకోడీలుగా వచ్చిన పక్షుల్ని సేవిస్తూ
అనుభవించిన
అనిర్వచనీయ ఆనందాలం మనం -

**జె. బాపురెడ్డి**

సృజన సుందర భావతారకలతో
ఆత్మానుబంధం పెంచుకున్న
అనుభూతులు పంచుకున్న
అన్వేషణావేశాలం మనం
అమృతాలోచనలం మనం -
మైత్రీమధువు నిండిన నీ హృదయం
మంటల్లో చితికి పోతున్నప్పుడు
అరవైనాలుగు వసంతాల శోభ
అలరించిన నీ రూపం చెదరిపోతున్నప్పుడు
నీవు లేని నా అస్తిత్వం
తావిలేని పూవై పోతున్నప్పుడు
నాకు మిగిలిన కన్నీటి చుక్కల్ని
అక్షరాలలో దాచుకుంటున్నాను -
నీ నిర్మల జీవితతత్వం - స్థితప్రజ్ఞత్వం
నీ అజేయ సాహసం - వీరవిజయ నేతృత్వం
నీ లావణ్య భావుకత్వం -
నీ అమరత్వంలో జీవిస్తాయని
నీ మానవత్వంలో వికసిస్తాయని
విశ్వసిస్తున్నాను
ఎప్పుడు నన్ను మళ్లీ
నీవెక్కట కలిసికుంటావో అని
ఎదురు తెన్నులు కాస్తున్నాను.

(పరిపూర్ణ మిత్రుడు, నిత్యచైతన్య చైత్రుడు కీ.శే. ఎన్. యాదగిరిరెడ్డికి పట్టిన బాష్పాంజలి)

# అమృతానుభూతి

ఎన్నో ఊహల్ని
ఎన్నెన్నో అనుభూతుల్ని
సజీవభావ చిత్రలుగా మలచిన
నా కలం
నీ అనిర్వచనీయ రూప కళా వైభవం ముందు
గొంతు కదపలేక కంపిస్తూ
తలవాల్చింది;
మంత్రముగ్ధమైన నా అంతరంగంలోనికి
నిన్ను ఆహ్వానించే దెలా !

నా దివ్య స్వప్నాల విజయధ్వజంగా
నా నిరర్థక జీవితానికి పరమార్థంగా
నేడు నాకు సాక్షాత్కరించావు
ప్రకృతిలోని నవ్య గీతికలుగా వినిపించావు

మిన్నేరు
నీ పాదాల మీదే తరగలెత్తుతున్నట్లు
శంపాలతలు
నీ నడుము చుట్టూ నాట్యం చేస్తున్నట్లు
సింగిణుల రంగులు
నీ కొప్పులో విరబూస్తున్నట్లు
తీగలు సాగే నీ ఒండి నిండా
సుధానిధులు పొంగి పొరలుతున్నట్లు
సంధ్యారుణిమ

**జె. బాపురెడ్డి**

నీ పెదవులకు పదును పెడుతున్నట్లు
అనుభూతి చెందుతున్నాను,
ఈ సృష్టికి అర్థం
ఈనాటికి గ్రహిస్తున్నాను -
నినుగన్న భూమాత
ధన్యురాలైందని భావిస్తున్నాను -
వాక్కులకు, ఊహలకు చిక్కవని
విశ్వసాహిత్యాలు
విధిలేక అంగీకరిస్తున్నాయి
ముగ్ధలైన లలిత కళలన్నీ
నీ కంఠహారాలై పులకిస్తున్నాయి

శస్త్రాలు, అణ్వస్త్రాలు
నీ చిరునవ్వుల చలువలో
మంచుగడ్డలై పోతాయోమో !
పాపపంకిలాలు పాలు కూడా
నీ కంటి దీపాల వెలుగులో
మునకలిడితే
పుణ్యతీర్థాలై పోతాయేమో !
నీ అమృత హృదయ వాటిక
సముచ్ఛ్వా పరిమళాలను మోసుకపోతూ
పవనాలు పావనమైపోతున్నాయేమో !

స్వర్గమన్నది ఉండి చచ్చినా నా కెందుకు
నిన్ను చూచిన కళ్లు అక్కడ చూచేదేమిటి?

## అక్షరానుభూతులు

వట్టిమన్ను -
నవయౌవన మోహినీ !
సకల విద్యల, శాస్త్రాల సారం
నీ దరహాస మకరందధారలో కనిపిస్తున్నది
అందాలు, అలంకారాలన్నీ
నీ రూప దర్పణంలో చూచుకొని
తమను తాము
సరిచేసుకుంటునట్ల నిపిస్తున్నది

దైవదత్తమైన ప్రకృతి ఉద్యానంలో
కళలన్నీ కిర్మీర పతాకలై
సాహిత్యాలు నవభావ సౌరభాలై
సౌందర్యాలు మహోజ్వల దీపాలై
ఆనందాలన్నీ మంగళతోరణాలై
నీ జీవితోత్సవం జరుపుతూంటే
నేను మైమరచి,
నాలోని కన్నులు తెరచి దర్శిస్తున్నాను
హర్షం వర్షిస్తున్నాను
నిజమైన కలవోలె
నీ యశః కళవోలె
జీవిస్తున్నాను -

*(ఒక కాలేజీ విద్యార్థి కలం కలల కవితానుభూతి)*

జె. బాపురెడ్డి

# జలశక్తి

ఏటిని చూచినా
ప్రాయేటిని చూచినా
నాటికీ నేటికీ నేను పాటనైపోతాను
ఋషిమాటనైపోతాను -

నదీనదాలలో నా ఎద నినదిస్తుంది
సాగర కాసారాలలో నా సాహిత్యం వికసిస్తుంది
లోకాన్ని జీవజలధిగా చూచే
లోచనం నా కుంది
జీవితాన్ని జలధారలో వెదికే
జిజ్ఞాస నా కుంది
నిజానికి మనది భూగోళం కాదు
జలగోళం! జీవన తటాకం -
ఖండఖండాలు అందులో వెలసిన
కళాఖండాలు - అమృతభాండాలు -

గుప్తజీవన సప్తసాగరాలు
నీరు పోసి నారు పోసి
పెంచుకున్న మహోద్యానంమహీతలం -
ఎన్ని గిరులు ! ఎన్ని ఝురులు
ఎన్ని తరులు! ఎన్ని విరులు
ఎన్ని పక్షులు ! ఎన్ని పాటలు
ఈ జీవన బృందావనంలో
ఈ జలధిజనిత
మృణ్మయానందంలో

# మనిషిని మార్చేదెలా !

అన్నీ అర్థమవుతున్నాయి
మనిషిమాత్రం కావటంలేదు
వెనువెనుక వానరుడట సరే
మున్ముందు పురహరుడౌతాడట సరే
ఈ మధ్యలోని నరుడెవడో మాత్రం
అంతం చిక్కడం లేదు.

అన్ని తత్వాలు అర్థమౌతాయి
మనిషి మనస్తత్వం మాత్రం కాదు
మనిషి బహువేషధారి
బహుభాషల మాటకారి -

మనిషిని మార్చాలన్న
మహోద్యమాలన్నీ
మట్టిపాలైనాయి
మట్టిలో పుట్టి
మట్టిపాలవుతున్న మనిషి
వట్టి మట్టి మాత్రం కాదని
మానవ చరిత్ర చెప్పే పాఠం

తెలిసి తెలిసి తప్పులు చేసే
"తెలివితేటలు" మనిషి సొంతం
అందుకే మనిషి జీవితం అయిపోతున్నది
విషాదాంతం -

జె. బాపురెడ్డి

శరీరం పేరుతో ఆత్మను
ఆత్మపేరుతో శరీరాన్ని
వంచించే మనిషిని
నిర్వచించే దెట్లా
మార్చేదెట్లా !
"మార్పు"లకు మార్గం చూపుతాడు
"నేర్పు"లకు నీతులు నేర్పుతాడు
దేవుడున్నాడనీ, లేడనీ
నిరూపిస్తాడు
నిజం తెలియదని, అబద్ధం చెప్పనని
వాదిస్తాడు -
తన జీవితానికి తానే
కర్త, కర్మ, క్రియగా
తాదాత్మ్యం చెందుతాడు
మిధ్య అంటే మాయ అంటే
ఏమిటో
"సచ్చిదానం దాన్ని" అడుగుమంటాడు
తాను మాత్రం
చెప్పేది చేయడు
చేసేది చెప్పడు
చేసేది చెప్పేది తన మనస్సుకు
తెలియనీయడు -
చట్టాలు చేస్తాడు - ఉల్లంఘిస్తాడు
నేరాలు చేస్తాడు - నిర్దోషినంటాడు
విలువల్ని వేదికల మీద భజిస్తాడు

ఆచరణలో త్యజిస్తాడు
అధికారం - ఐశ్వర్యం తప్ప
అన్నీ మిధ్యేనంటాడు

చావన్నది ఉండి చచ్చినా, తన
స్వార్థానికి భయం లేదంటాడు -
మతాలు - హితాలు
వేదాలు, వేదాంతాలు
శాస్త్రజ్ఞులు - ఆత్మజ్ఞులు
దర్శించిన సత్యాలన్నీ
మనిషిని మానవత్వం వైపు
మళ్లించలేక పోతున్నాయి

దేవుడనే వాడుంటే
మనిషిని "మనిషి" గా మార్చగలిగే
"మానవత్వం"గా అవతరించు మంటాను
సంభవామి యుగేయుగే"
వాగ్దానం
"సత్యం" అని నిరూపించుమంటాను.

జె. బాపురెడ్డి

# బాల్యోహలు

చెట్టుమీద పువ్వులు నవ్వటం
చూశాను నేను

చెట్టుమీద పక్షులు పాడటం
విన్నాను నేను

చెట్టుతో చిరుగాలులు ఆడుకోవటం
తిలకించాను నేను

చెట్టు ఆకుల్లో పండ్లు దాగటం
గమనించాను నేను

చెట్టు కొమ్మల్లో కోతులు గంతులేయటం
ఆనందించాను నేను

చెట్టు వెనక కూర్చున్న చందమామను
రమ్మని పిలిచాను నేను

చెట్టు క్రింద వెలుతురు నీడ వేయడం
కనిపెట్టా నేను

అయితే,
చెట్టును భూమికి కట్టివేశారని
బాధపడ్డాను నేను
అవి కూడా తిరుగాడుతుంటే
ఎంతో బాగుండేదనుకుంటాను

# స్నేహశీలి చందమామ

మా ఊరునేర్పిందినాకు
మాటలు, ఆటలు, పాటలు
మమతలు, ఊహాలు, ఆశలు
అమ్మ ఒడిలో కూర్చుని
"చందమామ రావే" అంటూ
చదువు ప్రారంభించినపుడే
మింటికే మంటికీ మధ్య
ఇంటికీ ఇంటికీ వలె
ఎంతో దూరం లేదని ఆనందించాను -

మొయిలు ఒడిలో చందమామ
అమ్మ ఒడిలో నేను కూర్చుని
ఒకరినొకరం పిలుచుకున్నాం
ఒకరిలో ఒకరిని చూచుకుంటూ
ఉప్పొంగే అమ్మ కళ్లల్లో
ఇద్దరం ముద్దుగా కలిసికొన్నాం
చుక్కల్ని లెక్క బెట్టుకుంటూ
శూన్యంలో వెన్నల గూళ్లు కట్టాం
చెట్టుకొమ్మమీద శశి
పిట్ట గోడమీద నేను
విలాసంగా తిష్ఠవేసి
వెన్నముద్దలారగించాం
చెట్టుకొమ్మ చేతుల్లో వాడు
అమ్మ చేతుల్లో నేను
ఊయాల జంపాల లూగాం -

బాల్యంలో  చివురించిన మా బంగారు చెలిమి
యౌవనంలో పుష్పించి
ఈనాడు ఫలిస్తూంది
నా చిన్ననాటి చెలికాడు చందమామ
నేను ఊరు విడిచి వచ్చింతర్వాత
దూరమైపోతున్నాడనుకొని
"రాకెట్టురాయబారం" పంపి
ఆకట్టు కొన్నాను మళ్లీ -

అందాల ఇందన్న ఇంటికి
ఆత్మీయుడు ఆంగ్స్ట్రాంగ్ వెళ్లినప్పుడు
నిజానికి శశి అప్పుడు నా దగ్గరే ఉన్నాడు
అర్ధరాత్రి నన్ను నిద్రలేపి
ఆనందలహరి పాడాడు
మబ్బులు కమ్మిన మహాబిలంవైపు
అతని కోసం లోకమంతా చూస్తుంటే
గుట్టుగా నా గుండెలో దాక్కొని
గుసగుసలు పెట్టాడు
సృష్టిరహస్యాల మీద
చీకటి తెరలు తొలగిస్తానని
మానవ కళ్యాణానికి మార్గం చూపిస్తానని
చక్కని చిక్కని చుక్కల సంగీతం వినిపిస్తానని
గిలిగింత పెట్టాడు.

# హిమాలయ గర్జన

"మనదేశపు హద్దుల్లోకి
మనశత్రువు రాలేదు
వచ్చాడా చచ్చాడే
బ్రతికి బయట పడలేదు" -
అంటూ, గర్జించింది హిమాలయం
వింటూ, కంపించింది విషవలయం
నీతినియంత్రణ రేఖ మీద
దుర్నీతి నీడ పండింది
కళకళలాడే కార్గిల్ మీద
ముష్కర కిరాతకుల చూపుపడింది -

విశ్వంభర వదనంలో విరబూచిన సుందర హాసం
కాశ్మీరం
క్షణకాలం వెలవెల బోయింది
నిర్ఘాంతంతో నిట్టూర్చింది -

ఆకాశంతో ఆడుకునే హిమాలయాలను
చిట్టెలుకలు ముట్టడించడమా !
రసాతలం అంటే లోయల్లో
గుంట నక్కల గుటగుటలా !
శూర వీర రణయోధుల ముందట
పెంట కుక్కల భవు భౌలా !
మంచు పూలు శోభించే సీమలో
చీడ పురుగుల చిటచిటలా !

అంటూ ఘోషించాయి!
విను వీధుల్లో విష్ణుచక్రాల విహంగాలు
నేల మీద నిర్నిద్ర భద్ర రుద్రశంశాల ఫిరంగులు !

వెండి కొండెక్కి వైష్ణవి కోయిల
కోహం! కోహం! అని పాడుతుంటే
త్వమేవాహం, త్వమేవాహం అంటూ
కన్యాకుమారి నడయాడింది
అంబా! మదంబా! యని, భారతిని
అంబాలా కీర్తిస్తుంటే
అగర్తలా ప్రేమాంతరంగంలో
అదే అనుభూతే నినదించింది
సమగ్ర ఉదగ్ర భారత జాతి
శతపత్రంలా రూపించింది
స్పర్ధలు మానుకొని సమస్యలన్నీ
దేశభక్తియై దీపించాయి -

పవిత్రమైన 'పులికొండ' కు
రక్తం పులిమిన విద్రోహుల మీద
అగ్నులు కురిపించాయి బఫోరు శతఘ్నులు
చిటపట చిటపట చీడలు కాలిపోయాయి
కిటకిటలాడిన పీడలు కూలిపోయాయి
పటపటమని పీతిరి గద్దలు రాలిపోయాయి
నక్కలూ, కుక్కలూ, రక్కసి మూకలూ
ముక్కు మొగము లేకుండా పారిపోయాయి

## అక్షరానుభూతులు

చీకటి దొంగలమూకలు
సత్య ధర్మశాంతుల ఎదల్లో రగిల్చిన పరితాపాన్ని
ఈ జగత్తు అపోహల్ని మార్చేసింది
భారత సేనల శక్తి ప్రతాపం -

పిటపిటలాడిన శత్రుపటాలాలు
అటూ ఇటూ దూకేశాయి
లోకమెల్లా ఛీ ఛీ యని తెగడుతూంటే
తోకముడుచుకుంది శత్రు ప్రగల్భం,
అమరవీరుల ఆత్మత్యాగం
అమృతపునీత పతాకాలైనాయి
విజయ శిఖరాలకు మకుటాలైనాయి.

# ఆధునికాసురుడు

ఆధునికాసురుడు
ఆరితేరిన బకాసురుడు
ఎలా ఉంటాడో ఎక్కడుంటాడో
ఎరిగించరాని కామ రూపుడు -

మరుగుజ్జులాగుండొచ్చు
మనిషికీ మాటకూ బెదరని
మ్రానులాగుండొచ్చు
నడి వీధిలో ఉండొచ్చు
వేషం ఎదైన కావచ్చు
భాష ఏదైనా మాట్లాడవచ్చు -

నెత్తిమీద వాడికి కళ్ళుంటాయి
నేరుగా చూడాలేనంటాయి
ఒంటినిండా వాడికి పళ్లుంటాయి
ఒంటిగా చిక్కినవాణ్ని కొరుక్కు తింటాయి -

పాదరసంలాగ తిరుగుతాడు
పాప పంకిలాగ పూనుకొని,
కొమ్మలెక్కి పాడుతాడు
కోకిల వేషం వేసుకొని -

## అక్షరానుభూతులు

సొంతలాభం కొంతైన ఉంటేనే గాని
గొంతెంత్తడు, గోరంతైనాశ్రమపడడు
దేశమంటే వానికి వట్టి మట్టి
మనుషులంటే మట్టిపురుగులు, మశకాలు -

వాడిమాట బెల్లంలా తీపి
వాడి బా నాగుబాముకు కాపీ
వాడు కులుతాడు మిత్రులనెడబాపి
వాడు వేస్తాడు గాంధీజీకే టోపీ -

సంగీతానికి రాలని చింతకాయవాడు
నాగస్వరానికి చిక్కని నాగుపాముపాడు
చెప్పిందానికల్లా అంటాడు జీహుజూర్, చిత్తం !
చెసేవన్నీ పొందడానికి అధికారం, విత్తం !
మాటాడుతాడు ముద్దుగా
వెన్నులో పొటేసేదాక
ఆటాడుతాడు అద్భుతంగా
మెడలో కాటేసేదాక -

నీడలాగ వాణ్ని పట్టుకోవడం కష్టం
చిచ్చులాగ వాణ్ని తట్టుకోవడం కష్టం
అయితే వాడు మనల్ని వేటాడుతున్నది స్పష్టం
ఆధునికాసురుణ్ని
ఎలా జయిస్తారో మీ ఇష్టం !

# సృజన శక్తి

నేను సృష్టిస్తాను
యంత్రాలు కేవలం నిర్మిస్తాయి
నన్ను నేనే సృష్టించుకుంటాను
నా శరీర పరిమితుల్ని అధిగమించే
జీవితాన్ని సృష్టిస్తాను
మన అనందచేతనలో
అనంతానుభూతిని సృష్టిస్తాను
పరిమితిలేని పరమసత్యాన్ని
దర్శించడానికి బారులు తీరి
బిడారులుగా
తీర్థయాత్ర సాగించే
అగణిత భావ సత్యాలను సృష్టిస్తాను
వలయపథంలో తిరుగుతూ
విరిగి పడుతున్న వృత్తపరిధుల్ని
నిలబెట్టే కేంద్రబిందువును సృష్టిస్తున్నాను
నా దేహం చితికిపోయినా బ్రతికి ఉండే
శాశ్వత జీవితాన్ని సృష్టిస్తాను

భౌతిక రూపాంగాల
విడివిడి అందాల కూడిక కన్నా
ఎంతో మిన్నయైన
పరిపూర్ణ సౌందర్యాన్ని సృష్టిస్తున్నాను
ప్రేమావేశంలో నుంచి ఉట్టిపడే

త్యాగానందాన్ని సృష్టిస్తున్నాను
సమాధానాలు లేని ప్రశ్నల్ని
ప్రశ్నించడానికి వీలులేని సమాధానాల్ని
సృష్టిస్తునాను.

ఇతరులు
ఏనాటికో గాని తెలిసికోగలిగేవి
నాకిప్పుడే అవగతమవుతున్నాయి
నేను అసంపూర్ణున్నే కాని
లోపభూయిష్టున్ని కాదు
నన్ను అధిగమించిన ఒకానొక శక్తికి
ప్రతినిధిని నేను
మనిషికీ దేవునికీ మధ్య
పరిణామం చెందుతున్న
ప్రయోగాన్ని నేను.

# చిరంజీవి స్వార్థం

సహస్ర ముఖాలతో
స్వార్థం విజృంభిస్తున్నది
కవితా వస్తువు కోసం వెదికే
నా కలానికి
అడుగడుగున ఎదురౌస్తున్నది -
"సమాలోచిస్తున్న ఓ కవీ !
అన్ని శక్తులను నడిపంచే
ఆది శక్తిని నేనేనయ్యా" అంటూ
అర్థాంతరన్యాసంతో
ఆత్మస్తుతి చేసికొంటున్నది -

ఔను,
సర్వాంతర్యామి స్వార్థం
సర్వకళా కోవిద స్వార్థం
సర్వార్థ సముపార్జని స్వార్థం
కామ రూపిణి స్వార్థం
కళ్లున్నా లేకున్నా కనిపించే
యదార్థం స్వార్థం
నా కవితా వస్తువై కూర్చుంది -

వాణియోనా ఆకాశ వాణియైన
రేణువైనా కరేణువైనా
తప్పించుకోలేని
చిత్రాతిచిత్ర వ్యూహం
చిరంజీవి స్వార్థం -

మనిషిలో దైవాంశాలను
మాలగా కూర్చుతుంటే
చిటుక్కున దారాన్ని కొరికేసే
చిట్టెలుక స్వార్థం
ఏ సూత్రాలకు కట్టుపడని
సూత్రధారి స్వార్థం

సమతాదీపాల పాలిటి
సుడిగాలి స్వార్థం
శాంతి గీతాల పాలిటి
అపశ్రుతి స్వార్థం
సామ్యవాద సాహిత్యాన్ని
సమయోచితంగా వ్యాఖ్యానించి
సకల జనాదరణ పొందే
సవ్యసాచి స్వార్థం -

ఏ పార్టీ ఏదైనా
మెజార్టీ తనదేనని
ఎన్నికలు ఎన్ని జరిగినా
ఎవరూ తననోడించలేరని
సవినయంగా చాటుకునే
"స్వార్థత్యాగి" స్వార్థం
దేవుణ్నీ దేశభక్తినీ
దివ్యంగా కొనేస్తున్న
దీశాలి స్వార్థం
"నన్ను నీవు జయించలేవు" అంటే
నవ్వేస్తున్నది స్వార్థం -

# అజ్ఞానం - ప్రజ్ఞానం

తూర్పుపడమరలు కురిపించిన
తురీయకాంతిలో తడిసిన నేను
వైషమ్యాలతో, వైరుధ్యాలతో
సంక్షుభితమైన సమాజ జీవితంలో
సామరస్య సౌజన్యాల కోసం
అన్వేషిస్తున్నాను -

"మనిషి" అంటే ఎవరో
నేను పునర్నిర్వచిస్తున్నాను
మానవుని
మానసిక భౌతిక శక్తుల్ని
వెలికి తీస్తున్నాను
ఆత్మహత్యా సదృశమైన
అపకార ప్రవృత్తిని
సర్వనాశన కారకమైన
తామసిక స్వార్థోన్మాదాన్ని
త్యజించుమని హెచ్చరిస్తున్నాను,

విదితాలతో ఆడుకుంటూ
అవిదితాలను వేడుకుంటూ
అజ్ఞానం - ప్రజ్ఞానం మధ్య
మనిషికీ - దేవునికీ మధ్య
సుహృద్భావ సత్యదర్శన

సంభాషణకు
శుభారంభం చేయిస్తున్నాను

మనిషినుంచి మనిషిని రక్షించడానికి
నిగూఢార్థ బ్రహ్మలిపి శ్రుతులను
మానవ జీవిత
యథార్థ చిత్రాలుగా తీర్చాలనే
కృతనిశ్చయంతో ఉన్నాను -

సహజ అంతర్ జ్ఞానప్రేరితం
నా ఆలోచన
నిత్య సత్యాన్వయ పూరితం
నా పరిబాష -

# రసతపస్సు

అస్తినాస్తి సంగమించిన
నీ కటిరేఖా తటిమీద
ప్రతిష్ఠించాను
నా ఆత్మ లింగాన్ని
కామాక్షీ! కదిపేయి
నీ శ్రీకర కర విన్యాస లాస్యంతో
నా హృషీకేశ మస్తక శృంగాన్ని

నీ పాద పద్మాసన
యోగస్థితిలో రమిస్తున్నాను
నా ముక్తి భ్రమాభ్రమర భ్రమణం
విరమిస్తున్నాను
నీ దయా ధర్మ వీక్షణాలతో
రసానందం అనుగ్రహించు !
నీ మార్మిక ధవళమందహాసంతో
నా శూన్యభావ కుహరాన్ని వెలిగించు -

నీ అరుణారుణ అధర బింబంతో
చిమ్మ చీకట్లలో చిక్కిన
నా కళ్లను చుంబించు
రాగోషస్వినివై -

జరామరణ భయం లేని
నీ పరీరంభ సుఖంలో
నన్ను బంధించి రక్షించు.

# జీవిత తర్కం

నేను మృత్యువును
నా వెంట తీసుక వెళతాను
అ ప్రమేయ ప్రశాంత సాగర గర్భంలోకి,
నా జీవితాన్ని
అజ్ఞాన విజ్ఞాన మార్గాల వెంట
అంతులేని ఆనంద పారావారాల లోకి
తీసుకవెళతాను -

జీవన్మరణాలు ఉభయతీరాలుగా
ప్రవహిస్తున్నాను
ఘూర్ణిస్తూ, గర్జిస్తూ, తరగలిస్తూ
ఎక్కడెక్కడ నుంచో హఠాత్తుగా వెలువడే
భావావేశంలో చెంగలిస్తూ . . .
దిగంతాల వరకూ పరివ్యాప్తమయ్యే
ప్రకృతి సీమలు ప్రదర్శించే ఋతుక్రీడలను దర్శిస్తూ
అజ్ఞేయగమ్యం వైపు సాగిపోతున్నాను

ఆవేదనలకు పరితపిస్తూ
ఆనందాలలో పరవశిస్తూ
నా ఉనికిని సార్థకం చేస్తున్నాను
నన్ను నేను నిందిస్తున్నాను, అభినందిస్తున్నాను
ఆత్మీయంగా పరామర్శిస్తున్నాను
నా వేష భాషలు మార్చుకుంటూ
అనేక రూపాలతో, నామకరణాలతో

# ఉషారాగం

ఆమె
తన ఆత్మశక్తి మంత్రించిన
శబ్దాలతో కవితలు వెలిగిస్తుంది
అవి అతీంద్రియభావదీప్తులతో
అక్షరాను భూతుల్ని ఆవిష్కరిస్తాయి
జీర్ణ జీవిత సైకతాలను చీల్చుకపోయే
ఆమె నిర్భయ స్వప్నాల అడుగుజాడల్లో
అపూర్వ ఉపమానాలు, ప్రతీకలు, భావచిత్రాలు
పల్లవిస్తాయి -

కాలపు మాయాజాలంలో కనుమరుగైన
ఆత్మీయ దిఙ్మండలాలను
ఆమె ధైర్యసాహస దర్శనాలు కనిపెట్టాయి
ప్రబుద్ధాత్ముల
పరిపూర్ణ స్వేచ్ఛ పరమానంద వివేకాలను
ముంచెత్తిన మోసకారి చరిత్ర
నిర్బంధ నిశ్శబ్దసాగరంలో
ఆమె పరితప్త విశ్వాసశ్వాసము
విప్లవాత్మక తుపానులను రేకెత్తించింది -

ఆమె ఒక ఆగ్రహావేశ మానవీయ కంఠస్వరం
నిలదీసే ప్రశ్నించే శక్తీశ్వరి ;
సమతా సంస్కృతినీ, ప్రియాతి ప్రియ మూల్యాలను

శిథిలపరచిన దుర్నీతి తమః పటలాలను
చెదర గొట్టే కాళికేశ్వరి
ఆమె,
వర్ణ, వర్గ, లింగ, మత వివక్షలపై
దండెత్తిన ధర్మ యోద్ధ ;
ఆమె కార్య వ్యూహం
అంకిత భావ సర్వభూత హితత్వం
పారదర్శిక సత్యశీల ప్రబోధత్వం -
సంక్షుభిత మానవాళికి
మహోజ్జ్వల ఉత్కర్షక సందేశంతో
తూర్పు ద్వారం నుండి దూసుకవస్తున్న
నవశతాబ్ది, సహస్రాబ్ది సూర్యుణ్ణి
సాదరంగా స్వాగతించే
ప్రశాంత ఉషారాగం ఆమె !

# జడభరతుడు

కన్నీటితో వ్రాస్తున్నాను పన్నీటి పాటను
ఆవేదనతో పాడుతున్నాను
ఆనంద గీతికను -
సిగ్గుతో ఎగరవేస్తున్నాను
స్వేచ్ఛా స్వాతంత్ర్య పతాకాన్ని
విషాదాన్ని త్రాగుతున్నాను
విజయామృత చషకంలో
దేశభక్తి, త్యాగశక్తి క్రాంతిశీల ప్రజాశక్తి
అరవై ఏళ్ళు పోరాడి ఆర్జించిన స్వాతంత్ర్యాన్ని
వేలవేల వసంతాలు వెలిగించిన సంస్కృతిని
స్వార్థోన్మత్త కులతత్వం
సహన హీన మతమౌఢ్యం
కబళించాలని కుట్రలు పన్నుతుంటే
గ్రహించలేని ఆగ్రహించలేని
జడభరతుణ్ణి నేను భారతీయుణ్ణి నేను
ఔను,
మతం పేరుతో కులం పేరుతో
భాష పేరుతో, ప్రాంతం పేరుతో
నా జాతి గుండె లోనే నే బాకులు నాటే
భావావేశం నాది
విశ్వజనీన, విజ్ఞాన వేద సంస్కృతిని
వెర్రితలలు వేయించే
వికృతాకృతిలో చిత్రించే
వెర్రి విప్లవావేశం నాది.

అహం బ్రహ్మాస్మి
తత్వ మసి
ప్రతి మనిషీ దేవుడే అంటూ
సత్యతత్వం ప్రవచిస్తాను
కాని, మనుషులందరూ
సమానులే అను
మామూలు మానవతావాదాన్ని
సామాజిక సమతావేదాన్ని
అచరించడానికి, అనుసరించడానికి
ముందుకురాని మూర్ఖుణ్ణి నేను
జడభరతుణ్ణి నేను-భారతీయుణ్ణి నేను-

అంతరిక్షాన్ని జయిస్తూ
ఆత్మజ్ఞానాన్ని శోధిస్తూ
వసుధైక కుటుంబ జీవన
వేదనాదం వినిపించే నన్ను
వాయువ్య సరిహద్దుల్లో
విద్వేష విషవాయువులు పీల్చేస్తుంటే
తరతరాల చరిత్ర కట్టుకున్న
పవిత్రాశయాల గుళ్లల్లో
విద్రోహం, విధ్వంసం చొరబడి
విలయతాండవంచేస్తుంటే
ఆ వింత పరిస్థితిని
పురోగతి అనాలో
తిరోగతి అనాలో
స్ఫురించక చస్తున్న శాపగ్రస్తుణ్ణి నేను
జడభరతుణ్ణి నేను - భారతీయుణ్ణి నేను -

ఆకటితో
చీకటిలో అలమటించే
హిందూమహాసాగరస్వామిని
అదృష్ట తైలధారల్లో స్నానమాడించి
అభ్యుదయ భావ భావిదీపాలు పెట్టి
ఉభయ సంధ్యా రాగ డోలల్లో
ఊగే నా దేశలక్ష్మిని
ఈశాన్య నైరాశ్యారణ్యంలో
అనుమానాల గెరిల్లాలు
హత్య చేయ ప్రయత్నిస్తున్న
అస్తవ్యస్త దృశ్యాన్ని
అభివర్ణించలేని అవమానితుణ్ణి నేను
జడభరతుణ్ణి నేను-భారతీయుణ్ణి నేను -

ప్రణయానంద పారవశ్యంలో
ప్రణవ ప్రకృతి అడుకునే
ప్రగతి బంతి లాంటి భూగోళాన్ని దర్శిస్తూ
దివ్య స్నేహద్వీపాలు వెలిగిస్తున్న
ఆత్మ గౌరవగీతాలను
అవని గొంతుకకు అందిస్తున్న
భరతమాతను క్రుంగదీసే
ఈ పీడ కల లేమిటి?
నిర్బంధ కులాంతర వివాహాల
నిస్తుల ప్రేమారామంలో
మతాతీత సభ్యతా సమాజ వల్లికపై
సమతా సౌభాగ్య జీవితోపనిషత్
స్వప్నాలు పండిద్దాం రండి !

నియంత్రిత కుటుంబశక్తితో
స్వతంత్రతా, సమైక్యతా, సమగ్రతా
శాంతి సోపానాలపై
యుగయుగాలు భరతజాతిని నడిపించే
ప్రణాళికా ప్రణవ శంఖం పూరిద్దాం లెండి !
త్రికరణశుద్ధి లేని తెలివితేటలు
విద్యలు నేర్పిన హిపోక్రసీ
పరపీడన క్రీడ లాడకుండా
జాతి జీవిత రథాన్ని
దుర్నీతి పథాలవైపు, త్రిప్పకుండా
పాటుపడతామని
ప్రతిజ్ఞ తీసుకుందాం రండి-

కుచేలునితో కుబేరుడు
"త్వమేవాహం సహోదరా" అంటూ
తాదాత్మ్యం చెందినప్పుడే
అద్వైత వేదాంతానికి
అర్థం సంక్రమిస్తుంది
ప్రజాస్వామ్య వాదంలో
పరమార్థం పరిమళిస్తుంది!

# జాతిమాత పిలుస్తున్నది

కలలుకనే నా హృదయం
కన్నీరు కారుస్తున్నది
ఆనందం పండే నా బ్రతుకులో
ఆవేదన రగులుతున్నది
నా మౌనమనోవ్యథను
అభివ్యక్తం చేసే
మహాకవి ఎవరు ?
నా విశాల కుసుమవనంలో
నాగుపాముల్ని చొరనీకండి !
ఈ నేల నాడుల్లో
ఈ గాలి గుండెల్లో
ప్రేమపరాగాలు ఒలికించే
స్నేహసౌరభాలు చిలికించే తోటమాలిని -
అవి కాటువేయకుండా కాపాడండి
ఆవేశాలు కావేషాలు మాని
అందరూ కలిసి ఆలోచించండి
ఈ భరతమాత రూపాన్ని
భావిభాగ్యోదయ దీపాన్ని
నిలబెట్టండి -

అటు, రాజసంగా అంబరాలు చుంబించే
శీతాద్రిశిఖరాలనూ
ఇటు, ఆత్మీయంగా సాగరాలను కౌగిలించే
తీరాల దృఢదీర్ఘహస్తాలను
ఒక్కటిగా దర్శించే అఖండదృక్కును

ముక్కలు ముక్కలు చేసుకోకండి -
ఈ దేశ ప్రగతినీ అభ్యున్నతినీ నడిపించే
పంచప్రాణైక సత్యాల - ఆశామయస్వప్నాల
రెక్కల్ని ముక్కలు చేసికొని
మీరెక్కడికి ఎగసిపోగలరు ?

ఆవేశాలు కావేషాలు మాని
అందరూ కలిసి ఆలోచించండి -
భాషలు
మాట్లాడుకోవడానికి కాని
కాట్లాడుకోవడానికి కాదు
ఏ భాషలో మాట్లాడుతున్నది కాదు
ఏమి మాట్లాడుతున్నది ముఖ్యం
దురాలోచనల భాష కాదు కావలసింది
దూరాలోచనల భాష
దేశాన్ని దేశవాసుల్ని
విడదీసే భాష కాదు నేర్చుకోవలసింది
ముడివేసే భాష -

అందుకే భాషపేరుతో విద్వేషాన్ని బోధించకండి
ప్రాంతాలపేరుతో
వివాదాల ద్వీపాలు సృష్టించకండి
ప్రాంతం ఏదైనా
స్వాంతం నా దేశమేనని
ఈ నేల పులకించేటట్లు
ఈ గాలి పరిమళించేటట్లు ప్రకటించండి -

అన్యాయాలను ఎదిరిస్తూ
అన్యోన్యాన్ని పెంపొందించే
భాష ఏదైనా నాదేనని
బల్లగుద్ది చెప్పండి -

శాంతి గీతాలు ఆలపించవలసిన మతాలు
సమరఘోష నేర్పించవద్దు
ప్రేమామృతాలు పంచవలసిన హేమాలయాలలో
విద్వేష విలయనాట్యాల ఉద్వేగాలు పెంచవద్దు -
మనిషిలోని మానవత్వాన్ని మంటగలిపేవి
మతాలు కావు - మారణహోమాలు
మనుషుల్ని బ్రతికించేవి కులమతాలు కావు
శక్తిని పోషించేవి రక్తపాతాలు కావు
అందరం కలిసి ఉంటేనే
ఇది సుందరమైన దేశం
ప్రతి ఒక్కరూ అందరికోసం పాటుపడ్డప్పుడే
ప్రగతి నిత్య వసంతమై పాడుకొంటుంది -

స్వార్థాలను సంకుచితత్వాలను పెంపు చేయటానికి
భరత జాతి వెచ్చిస్తున్న శక్తిని
సమైక్యతనూ సర్వతోముఖ సౌభాగ్యాన్ని
సాధించడానికి వినియోగిస్తే
నా కన్నీరు పన్నీరై ప్రవహించదా
సమ్యక్ సమగ్ర సమైక్యతాకేదారమై
నాదేశం ఫలించదా !

జె. బాపురెడ్డి

# యూనస్ ఎమ్రీ

పదిహేను దశాబ్దాల క్రితం
మహాశక్తిశాలి, అతులిత వితరణ శీలియైన
కాలబ్రహ్మ
మానవలోకానికి ప్రసాదించాడు
ఒక అత్యద్భుత పుష్పం
ప్రేమతత్వ సార రూపం
వృక్షశాస్త్ర భాషలో "ఏకత్వ జీవితత్వం"
కవితా పరిభాషలో "యూనఫ్ ఎమ్రీ"

మానవుడు ఎవరు ?
ప్రతి మనిషి మనస్సును కలవరపెట్టిన ప్రశ్న
మానవుడే దేవుడు
ఎమ్రీ ప్రవచించిన సమాధానం!
అవును, దేవునికి ఊరూ పేరూ లేవు
అతడు మానవ రూపానికి ప్రాణం పోస్తాడు
అతడు గోచరుడు - అగోచరుడు
దాగుడు మూతలాడుతాడు
దా చేస్తాడు - శోభిస్తాడు అద్భుతావహ జీవిత క్రీడలో
"నేను భూమిమీదికి వచ్చింది కలహాలకు కొట్లాటలకు కాదు
ప్రేమే నా జీవిత ధ్యేయం
ద్వైత భావం నన్ను విడనాడాలి
దేవుడూ - నేనూ విడవిడిగా ఉండరాదు"
అంటూ "ప్రేమోద్యానం"లో
పాడుకున్నాడు గానకోకిల యూనస్ ఎమ్రీ

ఆయన వాణిలో సనాతన వేదనాదాలు ప్రతిధ్వనించాయి
టర్కీ నుండీ, ప్రాక్ పశ్చిమదిశాంతాల వరకు
తన ప్రేమ హస్తాలను సాచి
పరమానందాను భూతిలో
ఇంపైన ఇలాగోళాన్ని కౌగలించాడు.

ఆయన మొరటు పాదాలు మట్టిని పరీక్షించాయి
ఆయన సున్నిత మార్మిక మానసం
పరమానందకర శ్రావ్య స్వరాల
ఆరోహణ అధిరోహణలో స్వర్గద్వారాన్ని తట్టింది

“దివ్య జీవితాన్ని భూమిమీదే అనుభవించు
మతం మత విశ్వాసం నీ అభిమత మైతే
అవి నీకు దివిలో ప్రాప్తించవు
ఇక్కడ భువిలో నేడు అనుభవిస్తేనే తప్ప”
ప్రవచించాయి ఉభయలోకాలు
ఈ పరిపూర్ణ సత్యాన్ని
ఆ ప్రజ్ఞానాత్మున్ణి
దైవావేశ గళంతో
యూనస్! యూనస్! యూనస్! ఎమ్రీ అంటూ
కాలం గుర్తించింది
మానవ వేషంలో సంచరిస్తున్న కాలాతీత దేవుణ్ణి

యూనస్ రొట్టెకంటే వివేకం మేలన్నాడు
జననం - మరణం కల్పిత కథ -
ప్రేమ - నీతి - దైవత్వం - మానవత్వం వంటి

జె. బాపురెడ్డి

అంతు పట్టని నిగూఢాంశాలను
దేహాత్మల మైత్రీ బంధంలో జోడించాడు ఆయన
ఈ లోకపు అజ్ఞాన భారాన్నంతా
ప్రేమ ప్రభా ధారల్లో కరిగించి వేశాడు

బుసకొట్టే విద్వేష విష ఫణి పణాలను మచ్చిక చేశాడు
వంకర టింకర్లు పోయిన వంట చెరుకుల్ని చక్కబరచాడు
ఆయన సత్యశ్రుతిలో సజీవ నిర్జీవాలు సమ్మిళితమై పోయాయి
ఆయన సన్నిధిలో
గతాగతాలు పరస్పరాలింగనం చేసుకొని
పరవశించి పోయాయి
మనిషి మరణిస్తాడు కాని మానవజాతి జీవిస్తుంది
యుగాలు చెల్లిపోతాయి కాని
ఎమ్రీ మాత్రం బ్రతికి ఉంటాడు -

ఉజ్వల చరిత్ర ప్రతి ప్రకాశ చిత్రం ముందు
కళకళలాడే ఇస్తాంబుల్ నగరంలో
తళతళలాడే తూర్పు ద్వారం వద్ద
సమైక్యంగా నిల్చిన దేశదేశాల కవులు
మధ్యధరాసాగర సమీర స్ఫూర్తితో
తన్మయాత్మక కవితారాగ బద్ధంగా,
యూనస్ ఎమ్రీ
అపార శక్తి శోభలను సంస్తుతిస్తున్నారు.

*(1991, సెప్టెంబర్ 16-20 లో ఇస్తాంబుల్ లో జరిగిన 12వ ప్రపంచ కవుల సమ్మేళనంలో టర్కీ దేశపు ప్రఖ్యాత కవికి పట్టిన కవితాంజలి)*

# రాకపోకలు

ఈ లోకం ఒక విమానాశ్రయం
ఇక్కడకి ప్రయాణీకులు దిగుతున్నారు
తిరిగి ఎగసిపోతున్నారు
ఈ రాకపోకలు ఎక్కడినుండి ఎక్కడికో
ఎవరికీ తెలిసినట్లు లేదు
నిరంతరం సాగుతున్న ఈ వ్యవహారం
ఒకే పోలికగల ముఖాల
ఇటూ అటూ రాక పోకడలు
ఎటో ఎటో - చెటా పటా।
వేరు వేరు వేషభాషలు
వేరు వేరు ఈడుజోడులు - వావివరుసలు
అందరూ ఎక్కుతున్నారు
అనుమతించిన వరుసలో
ఎవరికెప్పుడు సీటు దొరుకుతుందో తెలియదు
అందరూ వేచిచూసే వాళ్ళే
అయినా, అందరూ సిద్ధంగా ఊడవలసిన వాళ్ళే
ఎల్లప్పుడూ, ఎప్పటి కప్పుడూ
తప్పని ప్రయాణానికి –
విమానంలో ఎక్కటం - దిగటం
రెండూ ప్రకోపానుభూతులే
రెండూ సముల్లాస గీతులే !
సంస్మరణం - విస్మరణం
నేర్చుకోవటం - మరచిపోవటం వంటి
జననం - మరణం వ్యవహారం నడిపిస్తున్నది
విశ్వంభర విమానాశ్రయం.

జె. బాపురెడ్డి

# మృత్యు విశ్లేషణం

"జాతస్య మరణం ధ్రువం"
పుట్టింది గిట్టక తప్పదు
ఇది జనన మరణాలు
తమ సుస్థిర అస్తిత్వం కోసం
పరస్పరం కుదుర్చుకున్న
రహస్య ఒడంబడిక -
వాటి నిజరూపం బయట పెట్టుకోవద్దని
ఒక నిగూఢ ప్రకరణం కూడ
నిక్షిప్తం చేశాయి అందులో
వాటి ఉద్దేశాలను
బహురూపాలలో,
బహునామకరణాలలో
సూచించుకుంటూ
ఏ నిర్వచనానికి లోబడవు;
వెలుగు చీకట్లవోలె ఒకటితో ఒకటి
దాగుడు మూతలాడుకుంటాయి
ఆవర్తన తర్కంలో
ఉభయలింగ సమ్మిళిత స్వరూపంలో
అర్ధనారీశ్వరతత్వంతో
మాయాజాలం, నెరుపుతుంటాయి -

ఈజిప్టు లోని 'పిరమిడులు'
రోం లోని 'కొలంబ్రియం'
మాస్కో రెడ్ స్క్వేర్‌లో 'మసోలియం'

భారతదేశపు 'తాజ్‌మహల్'
జీవితపు సమాధులు
మృత్యువుకు చెల్లించిన
ఒక అపహాస్యానికి
పరిహాసాస్పద స్పందన
మృత్యువు, జీవితపు జన్మహక్కనే
నిజ నిరూపణం -

జంతుశాస్త్రం - కీటకశాస్త్రం
సాంఘికశాస్త్రం - ఖగోళ శాస్త్రం
రోగలక్షణ శాస్త్రం - మనోధర్మశాస్త్రం
తర్కశాస్త్రం - తత్వ శాస్త్రం
అన్నీ జీవశాస్త్రంతో ఆరంభమై
మృత్యు శాస్త్రంతో ముగుస్తాయి.

జె. బాపురెడ్డి

# తారుమారు

ఒకప్పుడు
చీకటికి వెలుతురు
బుద్ధి చెప్పేది
ఇప్పుడు
వెలుతురుకే చీకటి
విద్య నేర్పిస్తూంది
అప్పుడు
త్యాగం స్వార్థాన్ని ఖండించేది
ఇప్పుడు
స్వార్థమే త్యాగాన్ని దండిస్తున్నది
అప్పుడు
పేరుకు ఉన్న కులం
పోవాలన్నారు
ఇప్పుడు
కులానికి లేని
పేరు కావాలంటున్నారు
అప్పుడు
అవినీతికూడా నీతిగా మెలిగేది
ఇప్పుడు
నీతియే అవినీతిగా వెలుగుతూంది
అప్పుడు రాజకీయాన్ని కూడా
కవిత్వం చేసిన కోకిలత్వం విరిసేది
ఇప్పుడు కవిత్వాన్ని కూడా
రాజకీయం చేస్తున్న కాకితత్వం మెరుస్తూంది

అప్పుడు స్త్రీలకు చదువు లేదు
కాని, స్వాతంత్ర్యం ఉండేది
ఇప్పుడు చదువుకున్న మహిళామణులకు
స్వాతంత్ర్యం లేదు కాని
లేదని ఏడ్చే స్వాతంత్ర్యం ఉంది -
అప్పుడు
యువకవులు ప్రసిద్ధకవులను
పట్టి పట్టి అనుకరించేవారు
ఇప్పుడు
అలసిపోతున్న మహాకవులు
పేరు కోసం
ప్రచార కవులను అనుసరిస్తున్నారు

జె. బాపురె

# అంబేద్కర్ శరణం గచ్ఛామి

చైతన్య మహానదివై
భరతఖండం నిండా ఆవరించిన నీవు
శిలవై పోయావా !
దళితజాతుల హృదయకుహరాలలో
ఆశాదీపంగా వెలిగిన నీవు
కలవైపోయావా !
సంపూర్ణ స్వాతంత్ర్యం కోసం
సర్వస్వం త్యాగం చేసిన నీవు
భారత స్వారాజ్యలక్ష్మికి
పవిత్ర రాజ్యాంగం ప్రదానం చేసిన నీవు
శిలవు కాదు, కలవు కాదు
మానవతా వాద శిఖరాల మంచుమలవు !
ఎలా అర్పించను నీకు జోహారులు
ఈ నీ జన్మదినోత్సవం నాడు
వెలుగు చీకట్ల మధ్య పోరాటం
విజృంభిస్తున్న నేడు -

ఇన్నేళ్ల స్వరాజ్యరమ
ఎన్ని, ఎన్నికలవేడుకలు జరిపినా
ఎన్ని ప్రగతి పథకాలు వేసినా
నీవు ఆశించిన జాతి స్వాతంత్ర్యం
నిజం కావటం లేదు -
డెముక్రసీని - హిపాక్రసీ నడిపిస్తున్నది
ప్రజాజీవితాన్ని స్వార్థం పట్టిపీడిస్తున్నది

సమానత్వం ఆశించే వాళ్లకు
అసమానత్వం సమానంగా అభిస్తున్నది -
నీకు తెలియందేముంది  బాబా సాహెబ్ !
మన పెద్ద మనుషుల బుద్ధులు
మారు వేషాలు, మాయవేషాలు వేస్తున్నాయే కాని
మారటం లేదు
శంకరాచార్యుల "మాయావాదం"
చేస్తున్నది దేశంలో గారడీ నేడు
ఉన్నాయంటే అన్నీ ఉన్నాయి దేశంలో
లేవంటే ఏవీ లేవు - అంతా మిథ్య
అస్పృశ్యత పోయిందా అంటే
పోయింది
ఋజువు అడుగొద్దు !
పోలేదంటే పోలేదు -
కారణాలు అడగొద్దు

మతం నల్లమందని అంటే
మధుపానం లా దాన్ని సేవిస్తున్నారు
కులబేధాలు పోవాలని నీవంటే
కులాల వారిగా సంఘాన్ని విభజిస్తున్నారు
కుల నిర్మూలనం నీవు కోరితే
మాటకాస్త మార్చి
కులనిర్మాణం చేస్తున్నారు
కులవ్యవస్థను పునర్నిర్మాణం చేస్తున్నారు
నిన్ను పబ్లిక్ గా స్మరిస్తున్నారు
ప్రయివేటుగా విస్మరిస్తున్నారు

అపూర్వమూ, అమోఘమూ అయిన
భారతీయ కులమత పద్మవ్యూహాన్ని
ఛేదించలేక నీవే
"బుద్ధం శరణం గచ్ఛామి" అంటే
చావగా మిగిలిన సంఘ సంస్కర్తలు
"మరణం శరణం గచ్ఛామి" అనుకుంటున్నారు !

మళ్లీ ఒకసారి అవతరించు, అంబేద్కర్
"సంభావామి యుగేయుగే" సిద్ధాంతాన్ని
సమర్థిస్తున్నానని కోపగించవద్దు
అవతార పురుషుడు వస్తేనే తప్ప
ఈ దేశంలో ఏ కాలంలోనూ
అధర్మాన్ని అణచడానికి వీలు పడలేదు
పదకొండవ అవతారం ఎత్తిరా !
విష్ణువు అవతారం కాదు
శివావతారంగారా ! ధర్మరుద్రావతారంగారా !
నీ ఆశయాలకు, చెదరపోని
ఆకారం కల్పించడానికి
అంతరంగాలలో దాగిన
వింతశత్రువులను జయించడానికి
మార్పులు రాకుండా మార్పులు చేసే
మాయా మయవనస్తత్వానికి
ఒప్పుకున్నట్టే ఒప్పుకోని
తప్పుకొనే తంత్రానికి
బుద్ధి చెప్పడానికి
కావలసిన ఆయుధాలు ధరించి
అర్జెంటుగా వచ్చేయి !

# మెక్సికో పిలుపు

మెక్సికో
ఓ భూభాగం కాదు
భూలోక ప్రయోగశాల
కాలం
పరిణామ స్ఫూర్తితో చారిత్రక దృష్టితో
కుతంత్రాల మానవ నాగరికతల ?
ఉత్థానపతనాల మీద
పరిశోధనలు చేసిన ప్రయోగశాల
ఆల్మెక్, తేఓతి ఉవాకాన్, తోల్తెక్
మాయా, తెనొచ్ తిత్లాన్, ఆస్టెక్
వంటి సభ్యతలు, ప్రభావాలు
మెక్సికో సహస్రాబ్దాల చరిత్రలో మైలురాళ్లు -
మూడు దిక్కుల్లో
జాగరూక సాగరాల నిర్నిద్రతరంగాలు
ఉత్తరంలో అభేద్యమైన అరణ్యాలు
పరిరక్షిస్తున్న మెక్సికో దేశం
దేశీయ పురాసంస్కృతికి
కోట బురుజై నిలిచింది
అధునాతన శాస్త్రీయ సమాజపు
సముల్లాస కుశాగ్ర విద్యా బుద్ధులను ప్రదర్శించింది -
తమవన్నెచిన్నెల దేశాన్ని
తీవ్రంగా ప్రేమించే మెక్సికన్లను కలిసినప్పుడు
మహానగరాల రాజసం
చిరుపురాల అన్యోన్యత
మనల్ని పలకరిస్తాయి -

ఎండలో తడిసిన విస్తారమైన బీచులు
మంచుకప్పిన భుగభుగల అగ్నిపర్వతాలు
వలసాధిపత్య భాగధేయపు మనోహర చిహ్నాలు
ఆసక్తికర సుందర భౌగోళిక వైరుధ్యాలు
జ్ఞాపకార్థక నిర్మాణాల ఆశ్చర్యకర నిధులు
ఆదివాసులైన ఇండియనుల హస్తకళా విభవాలు
అలరిస్తున్నాయి మెక్సికోను
అనంతమైన వైవిధ్యాలతో -
గుండెల మంత్రించే కొండకోనల ఆశ్రమాలు
రమణీయమైన రాగి
చెంగలించే జలపాతాలు
శోభాయమానంగా
ఎండముసిరిన ఇసుకలో
చలువవెన్నెల నురుగులు చల్లే అలలు
భీకరమైన కోడెగిత్తల పోట్లాటలు
విన్నాణమైన నాట్యపద విన్యాసాలు
శ్రవణప్రేయమైన శ్రుతిలయలు
పులికితాశ్చర్యాలు కలిగిస్తాయి
నిగూఢమర్మాల ఆ నేలలో

అక్కడి సనాతన సంప్రదాయాలు
భారతీయ సంస్కృతిని స్మరింపజేస్తాయి
ఉద్దండ మెక్సికోలో
ఉల్లాసాల మాంటరీలో
నేను ఒక శివమెత్తిన మహాశక్తిని చూశాను
ఆవిష్కృత మౌతున్న అఖిలావని నాటకంలో

సముచిత పాత్ర నిర్వహించాలని
అర్రులు చాస్తున్న ఆవేశం అది -
సూర్యచంద్రులకు అంకితమైన
తేఓతి ఉవాకాన్ పిరమిడులు
నింగిని నేలను కలిపే సమాధిస్థితరహస్యాలను
నా చెవిలో గుసగుస చెప్పాయి
విగత జీవుల పేర వెలసిన మైలు పొడువు మార్గంలో
మౌనంగా నేను సాగపోతున్నప్పుడు -

మాంటరీ
మెక్సికో దేశపు పారిశ్రామిక రాజధాని
తన దేదీప్యమాన జీవిత సరళితో
సియర్ర మాద్రె పర్వతాలపై
శిరసులెత్తిన సెర్రొదెల సీలియా శిఖరాలలో
నన్ను ఆనందపారవశ్యంలో నిలిపింది -
1993 ఆగష్టులో
ఆ దేశపు ఆస్థాన కవి
"అల్ఫోన్సో రేయస్" పవిత్ర జీవిత చరిత్రను
సంస్మరించాను నేను
ప్రపంచ కవుల సమ్మేళనంలో -

సెక్యూలర్ విద్యలతో అలరింపబడి
చైతన్య చెర్చిల పచ్చలతో అలంకరింపబడి
రాజసౌధాలలో - రమణీయోపవనాలలో
కళాలయాలలో, మ్యూజియంలలో
మాంటరీ, తన ఆత్మోద్దీప్త
సర్వమత సామరస్య సౌరభాన్ని వెదజల్లుతూంది

తన సుప్రసిద్ధ "రుఫీనో తొమాయో" శిల్పఖండం
సూర్య దేవునికి నివాళులర్పిస్తూంది

ఇపుడు "ఆకాపుల్కో"
ఆహ్వానించింది నన్ను
ఈ భూగోళం మీద - మనిషీ దేవుడూ
కలిసి సృష్టించిన మహనీయ క్షేత్రం అది
భగవంతునికి కూడా మరులు కొలిపే వైభవసీమ అది
శాంత మహా సాగరమంతటి అనుభూతిని
నా కవితా హృదయంతో
దర్శించుమని పిలిచింది
ఉక్కిరి బిక్కిరి చేసే
ఉత్తుంగ పర్వతరాజరీతితో
మత్తెక్కించే మృదుల సువర్ణ సైకతాలతో
అలరాడే ఆనంద పాణి
ఆకాపుల్కో రాణి !
పొంగులెత్తే అఖాతం
రంగురంగుల పడవలతో ఆడుకుంటూ
అపూర్వ మైన వంటకాల ఘుమఘుమలతో
అనురాగాల ఇంద్రధనుస్సులతో ఆహ్వానించింది
సాహసకృత్య పూరిత దినాలు
స్వాప్ని కానంద రాత్రులు
హిస్పానిక్ సంస్కృతీ ద్వార్గాన్ని
దర్శించ రమ్మన్నాయి నన్ను
మహాకవి ఒక్తావియో పాస్ వాణితో
నా గొంతు కలిపి పాడుకొమ్మంది.

# ఎవరికి వారే

వసంతంనుంచి శిశిరం వరకు
వర్తులాకారంలో భ్రమిస్తూ
అంతులేని స్రవంతి తానే అనుకొనే
అహంభావం కాలానిది -

గుండె తపన తీర్చుకోవడానికి
నీటితో గాలి పటాల్ని చేస్తూ
నేల మీద నదీ సర్పాలుగా మారుస్తూ
మళ్లీ తనపొట్టలోకే పీల్చేసుకుంటూ
పోటిలేని మంత్రకాడు తానే ననే
పొగరుబోతుతనం సాగరానిది -

ఋతువులెన్ని మారినా
కాలం ఎంత పారినా
చరిత్ర జీవిత గతిలో
చెప్పరాని ఉత్థాన పతనాలు చేకూరినా
కదలకుండా మెదలకుండా
కండలేవీ కరగ కుండా ఉండే
బండబారిన మొండితనం కొండలది -

చెట్టుచేమలకూ
ఖగాలకూ, మృగాలకూ
గిరిజనులకూ, పురజనులకూ
తాపసులకూ - తాంత్రికులకూ

తీవ్రవాదులకూ, కాలవేదులకూ
ఆలవాలం తానే ననే
ఆత్మస్తుతి ఆరణ్యానిది -

సూర్యచంద్రులు తన చుట్టాలని
నవగ్రహాలు నక్షత్రాలు
తనకు ఆకాశఛత్రం పట్టారని
మనుషులందరూ తన మట్టిలోనే పుట్టారనే
తలతిరుగుడు భూగోళానిది -

ఈ వింత పోకడలను
గమనిస్తున్న
మాటకారి మనిషి
సృష్టిని సృష్టించిన దేవుడు
ఎలా పుట్టాడని, ఎక్కడున్నాడని
వెదుకుతున్నాడు తనలో తానే !

# చంద్రజాలం

ఆకాశ మంటపంలో
గుమిగూడిన తారాగణాలను
మంత్ర ముగ్ధుల్ని చేసే
"కాంతిజిత్తులు" ప్రదర్శిస్తున్నాడు
అందాల చందమామ,
తన మాయల మంత్ర దండంతో -

విశ్వ ప్రకాశన యజ్ఞంలో
తనమునకలై ఉన్న
వీరమార్తాండుని
వేడివేడి కిరణాలను
వంపు తిరిగిన శూన్యావరణం వెనకనుంచి
దొంగచాటుగా తెచ్చి
అది తన స్వంత కాంతి "కళానిధి"గా
నమ్మిస్తున్నాడు చంద్రజాలికుడు
అమాయకులైన తారామణులు
టక్కరి చంద్రుణ్ణి రేరాజుగా
వెన్నెల దొరగా
ప్రస్తుతిస్తున్నారు పారవశ్యంతో -

నాకో సందేహం కలుగుతూంది,
సృష్టిరహస్యాలు తెలిసిన
సూర్యుడు కూడా,

అద్భుత యుక్తితో
తన అపారఅంగార నిధుల్ని
ఇలాగే,
దొంగిలించుక వస్తున్నాడేమోనని
సంశయం కలుగుతూంది -

అనంత రోదసీ
నిబిడాంధకార రంగస్థల మీద
చేతులు మారే
కాంతి ప్రసారాల
జీవనపరంపరల
చకచ్చకిత ప్రదర్శన మేమో ఇది -

ఏకాంతి సత్యమూలమో !
ఏది మాయాజాలమో !
వాస్తవమిథ్యకు
మిథ్యా వాస్తవానికి మధ్య
చిక్కిన మనస్సుకు
చిక్కని సమస్య ఇది !

# ప్రేమ పయోధి

లాసాంజలెస్ లోని
"లాంగ్‌బీచ్", సుదీర్ఘ సైకతస్థలి మీద
శాంతమహా సాగరం
అగాధమైన ప్రేమాభిమానాలతో
పలకరించింది నన్ను
హిమాలయాల ఔన్నత్యాలను
క్యాలిఫోర్నియా
తేజోమయ స్వర్గ సీమలకు
మోసి తెచ్చినందుకు
అభినందించింది నన్ను -

జాతి పేరుతో
మతం పేరుతో - భాష పేరుతో
ముక్క చెక్కలైపోయిన
భూగోళాన్ని, ఆలింగనం చేస్తూ
అంతులేని తమకంతో
చుంబించే తరంగాల శోభను
పారవశ్యంతో ప్రస్తుతించాను !

సృష్ట్యాది సనాతన సాగరోర్మికలవలె
పరివ్యాప్త పవనాల ఆనందడోలల వలె
ఈ చిన్న పెద్ద భూఖండాలన్నీ
వాటి కృత్రిమ, కురూప సరిహద్దుల్ని
మహా సాగరమంతటి

జె. బాపురెడ్డి

సమైక్యతాభావతత్వంతో ముంచేసి
మానవజాతిని
శాశ్వత స్వేచ్ఛా స్థితిలో
ప్రేమ పూర్వక భ్రాతృత్వంలో
ఓలలాడిస్తే ఎంత బాగుండేది !

నేనెరుగుదును
దేశాలు, ఖండాలు విధించిన
ఆటంకాలన్నిటినీ ఉల్లంఘించి
ప్రపంచ మహానదులన్నీ
సువిస్తార ఔదార్య సంభరిత సాగరాలను
చేరబోయినప్పుడు కూడ
నా కామననే
గుండెమంటతో ఘోషిస్తుంటాయి -

నాకు తెలుసు
వినీల సాగరాల ఒడిలోనుంచి
వియత్తలానికి ఎగసిపోయి
నీరదాలు కూడా,
సంకుచితత్వాలతో
ఈసు అసూయలతో పక్షపాతాలతో
మండిపడే భూభాగాలకు
ఇదే సందేశాన్ని అందిస్తుంటాయి.

# సత్యయాన నిత్యగానం

ప్రాణం లేని ఊహల
ప్రదర్శనశాలలో
ప్రాణశక్తివై ప్రసరించావు !
కలలను నమ్ముకునే
కవి హృదయంలో
వాస్తవానుభూతివై
ప్రవహించవు !

ఎవరవో ! నీవు
ఒక్క చిరునవ్వు గంధంతో
వేల వేల వసంతాల
వీడని బంధం వేశావు
గంగా - వోల్గాలు కలిసినట్లు
నా చేయితో నీ చేయి కలిపావు
అవ్యక్త స్థితమైన,
నా సంక్షుభిత మానస గగనంలో
సువ్యవస్థితమైన
భావసౌధం నిర్మించావు
నింగినీ నేలనూ కలుపుతూ
సింగిణిలా నీవు నడిచిపోతూ
దేశకాలాలు సమైక్యం చెందిన
దీపంలా నిలిచిపోయావు
వేదోపనిషత్తుల విప్లవ క్షేత్రంలో
నాజీవిత ప్రాంగణంలో -

జె. బాపురెడ్డి

నీ మోవి నామోవి
నింగి నేలల్లాగే కలిసి పోయాయి
మన ఆత్మలు ఆనంద దిక్చక్రంలో తేలిపోయాయి
మనం ప్రవేశించిన గదికి
కాలం గడియవేసింది
చిలిపి చిలిపి చేష్టల్లో మనల్ని కలిపి కలిపి
చిద్విలాసం చేసింది -

సత్యయానవై నీవు
నిత్యగానమై నేను
సాహిత్య సంగీతాలవోలె సంచరించాం
సమతా నందనపథంలో
సుషమా సౌఖ్య వీథుల్లో -

భాషలకందని భావచకోరాలమై
అందీ అందని నెలపాత్రలో
డెందాలను ముంచుకొని
వలపు వెన్నెలలు ఆరగించాం -

నరులమో మనం సురలమో
అర్థం కాక
అర్ధరాత్రి నవ్వుకుంది
అవును
విజ్ఞాన వినోద వియత్తలంలో
విహరించే నక్షత్రాలం మనం
కష్టాల కారు చీకట్లను జయించిన
కాంతి గీతాలం మనం -

# పల్లవి లేని పాట

ఛందస్సు వదలని
సంప్రదాయ పద్యం లాంటి
సంగీతం లేక కదలని
శాస్త్రీయ గేయంలాంటి
ప్రియుని కోసం
అన్వేషిస్తున్న నన్ను
వచన కవిత్వంలా వచ్చి
పట్టుకున్నావు నీవు -

పల్లవి లేని నీ ప్రేమపాటలు
నియమంలేని నీ పద్య పాదాలు
అలంకారాలు లేని
నీ అయోమయ భావాలు
నన్ను ఉక్కిరి బిక్కిరి చేస్తున్నాయి
ముక్కలు ముక్కలు గాకోస్తున్నాయి -

నీవు, నా
యతి ప్రాసలు ఎరుగలేవు
గణ విభజన చేయలేవు
గురు లఘువులు గుర్తించలేవు
ప్రియుడా ! నిన్ను పిలిచేదెలా ?
సఖుడా ! నిన్ను కొలిచేదెలా ?

జె. బాపురెడ్డి

నీ సూటిమాటల సూదులు
గుచ్చుకుంటున్నాయి పులకలై
నీ మోటు కండరాలు
ములుకులై నన్ను క్రుంగదీస్తున్నాయి
నీ అభ్యుదయ సౌందర్యం
నన్ను ఆవేశపరుస్తున్నది
నీ విప్లవాకృతి
నన్ను విహ్వాలను చేస్తున్నది
నీ చిలిపి కోతి చేష్టలు
నాకు చక్కిలిగింతలు పెడుతున్నవి -

జానపద సాహిత్యంలాంటి నన్ను
జ్ఞాన పథ సౌహిత్యంతో ఏలుకో !
వ్యాకరణాల ముళ్లు లేని
వాస్తవ కుసుమాన్ని నన్ను
నీ స్వప్నాల గుండెలో తురుముకో -

వేపచెట్టు రావిచెట్టుల్లా
పెనవేసుకుందాం
కాలివ్రేళ్లతో నేలపరుపును గిల్లుతూ
చేతి వ్రేళ్లతో నింగి బుగ్గలు నిమురుతూ
పార్వతీ పరమేశ్వరుల వలె
పరవశించి పోదాం -

# హరి - హరిణి

విశాలమైన నీవక్షస్థలం మీద
విహరించే నా చూపులు
నాకంటి పాపల తెరలమీద
నాకలోకాలు సృష్టిస్తున్నాయి
నీ ఉద్దండ బాహో దండాలమీద
ఊగిపోతున్న నా ఊహలు
నీ నిస్తుల మస్తకం మీద
వాస్తవాలై మెరుస్తున్నాయి -

నాథా, నాథా! అంటూ
నా నాలుక నాట్యం చేస్తున్నది
నీ వజ్ర దంత వేదిక మీద
పారవశ్యపు పరదాల వెనుక -

నీ చైతన్య శక్తి బిందువులు
నా నిశ్చలతా సింధు శుక్తిలో రాలి
మన బాధా ముక్తి ముక్తాఫలాలై
మధురానుభూతి కలిగిస్తున్నవి -

నా నరహరివి నీవు
నీ మనోహరిని నేను
నీవు హరి నేను హరిణి
ఆటో వేటో తెలియని
అనుబంధం మనది.

జె. బాపురెడ్డి

# చుక్కల సెలయేరు

నీ
అపూర్వ సౌందర్యం
నన్ను
ఆలింగనం చేసుకున్నపుడు
ముగ్ధుణ్ణై మూర్ఛపోయాను
నా కనుల కవాటాల తెరచి
మేలుకొన్న కలలు
నన్ను గేలి చేసినప్పుడు
మన చుట్టూ ఆవరించిన నిలువుటద్దాలు
మన నగ్న రూపాలను చూచి
మాయామయంగా నవ్వుకున్నాయి -

బంగారు బొంగరాలు రెండు
బ్రహ్మాండం బ్రద్దలయ్యేటట్లు
నాగుండె మీద నీవు త్రిప్పుతుంటే
బోధపడని బాధతో
నాకళ్లు
గిర గిరా తిరిగిపోయాయి
చిక్కని నీ కురులు
చిమ్మిన చీకట్లలో
అంతా శూన్యంగానే కనిపించింది నాకు
నా సరసభావ తరంగాలు
నీ పెదవుల దాక చేరలేక
నీ పదముల చెంతనే
చెదరి పోయాయి -

శృంగార శిఖరాల నుండి
చుక్కల ఏరులా పారిన
ఆ బంగారు అనుభూతి
నీ ఆత్మార్ణవం వైపే ప్రవహించింది
ఆగ్రహించినా అనుగ్రహించినా
నిన్ను అందుకోలేని
ఆశాతరంగాన్ని నేను
అందుకే
నా నెచ్చెలీ
నీవే
నన్ను అందుకొని
ఆదరించాలి !

జె. బాపురెడ్డి

# మంత్ర దండం

నా ఒంటిలోని
రక్త తరంగ తురంగాలకు
దౌడు నేర్పే రౌతు వీవు -

నా ముకుళిత చర్మచక్షువులకు
వికసనం నేర్పే
మర్మకిరణ మార్తాండుడ నీవు -

నా పసుపు పారాణి పాదాలకు
చెమట బిందువుల చిరుగజ్జెల పాట నేర్పే
మోహ మృదంగ వాదకుడ నీవు -

నా నూగారు నల్ల త్రాచుచే
రాగాల నాట్యమాడించే
భోగభోగినీ పాలకుడ వీవు -

తీరిక లేని నా కోరికలు తీర్చే
మంత్ర దండం ధరించిన
మహేంద్రజాలికుడు వీవు -

ఇన్ని కళా కౌశలాలతో
నాథా నన్ను వేటాడుతుంటే
నే రెప్ప వాల్చే దెలా !

# ఆపాద మస్తకం పుస్తకం

నా ఆపాదమస్తకం
ఓ పుస్తకంగా చదివేస్తున్నావు
కుసుమాస్త్ర విద్యాపరీక్షకు
కూర్చోబోతున్నావా
ప్రేమార్థీ !

నా హస్తరేఖా లేఖల్ని
కునులు మూసుకొని చదివేస్తున్నావు
కటిక చీకటిలో కూడా
నీ తేనే పెదవుల
తెలుగుభాషలో -

అరమోడ్చిన
నా కనులలో చొరబడి
అర్థాలు వెతుకుతున్నాయి అదే పనిగా
నీ కొంటె చూపుల వ్యాకరణాలు -

నా భావోద్ధత
హృదయ ప్రబంధ స్కంధాలను
మంధించాలని ఆవేశపడుతున్నది
నీ మధుర విజ్ఞాన జిజ్ఞాస -

నా చెమ్మగిల్లిన శరీరం మీద
నాకానుభవ టీకా తాత్పర్యాలు
చిలిపి చిలిపి లిపిలో
చిత్రంగా వ్రాసుకుంటున్నాయి
నీ కరచరణాల కలాలు

ఇంత శ్రద్ధగా
త్రికరణ శుద్ధిగా
స్త్రీ విద్యాధ్యయనం చేసే
నిత్య సత్య రత్యార్థీ !
నీకు జయోస్తు !
ఎన్ని అగ్ని పరీక్షల్లోనైనా
ఇట్టే గెలుస్తావు
శుభమస్తు !

# తాంత్రికుడు

ప్రణయ సఖా! నీ చూపులు
నన్ను వేధిస్తున్నాయి
బాధిస్తున్నాయి
అయినా
ఆ చూపుల్ని
తూపు లనలేక పోతున్నాను
తూపు
ఒకే దిశలో వెళుతుంది
ఏదో ఒక చోట
తగులుతుంది
మరి నీ చూపో
ఒకేసారి
పలుదిక్కుల్లో
దూసుకుపోతుంది
ఏక కాలంలో
నా సకలాంగాలను
బాకులా గ్రుచ్చుకుంటుంది -

నా పంచేంద్రియాలు,
పంచ ప్రాణాలు
నీ పంచబాణసంచా పర్వంలో
పరవశించి పోతున్నాయి
మదనా! అని సంబోధిస్తే

మాట సరిపోవడం లేదు
నా ఎడద కడలిని
మరిగించే భాస్కరా
నా వలపు తేనె
దొంగిలించే తస్కరా
నిన్ను దేనితో పోల్చాలో తెలియక
నివ్వెర బోతున్నాను
నీవు
మాంత్రికుడవో
తాంత్రికుడవో
యాంత్రికుడవో
తోచక
నిలువున నీరై పోతున్నాను
నీ స్మృతిలో
నీ ద్యుతిలో
నా మతి కోల్పోతున్నాను.

# అమృత ధామం

ప్రకృతి పార్వతి పాటలాంటి
రైను నదీ తరంగాలు
ప్రగతి లక్ష్మి బాటలాంటి
సుందర శాంత మహాసాగర
సుదీర్ఘ తీరాలు
బ్రహ్మరథం పట్టినవి
మన ప్రణవ ప్రణయ జైత్రయాత్రకు -

పాతాళపు లోతుల్లోకి దూకి
తరుణ కిరణ హస్తాలతో
ఇంద్ర ధనుస్సుల్ని ఎక్కుపెట్టి
ఆకాశంతో ఆడుకునే
నయాగరా జలపాతాలు
విజయీభవా అంటూ
మన మీద మల్లెల మొల్లల
జల్లులు కురిపించాయి -

కాంతి బావుటా పట్టుకొని
కాలాన్ని కేలిత్తి పలిచే
చి "స్వేచ్ఛామూర్తి" మనల్ని చూచి
చిరు నవ్వుల నౌక పంపించి
తన నడి సంద్రపు గుడిలోకి ఆహ్వానించింది
పవిత్ర ప్రణయ తత్వ తరంగ
పాఠాలు బోధించింది -

** Statue of Liberty (USA)*

నెచ్చెలీ !
భావభౌతికానంద
జీవన నందనంలో
మనం లీలా విలాస విహారం చేస్తూ
నేల పరుపుపై పడుకున్నపుడు
మన చూపులు
చుక్కల తోటలో చొరబడి
సుగంధ మరందాలు
సేకరిస్తున్నపుడు
మన చుట్టూ వున్న మట్టి పులకించి
కుకెన్ హాఫ్
పూల కడలి అయింది
మన శరీర క్షేత్రంలో విరిసిన
ఆత్మానుభవ అక్షరారామం
చి అమృత ధామం అయింది.

* ఆంస్టర్‌డాం

# శూన్యంలో చుక్కల కోట

శూన్యం ఎంత బలీయమైందో
చుక్కలను అడుగుతే తెలుస్తుంది -
ఒక్క బ్రతుకుభారం మోయలేక
ఉక్కిరి బిక్కిరి అవుతున్న మనిషి
లెక్కలేని చుక్కలను తన రెక్కల మీద
ఆడించే శూన్యావరణాన్ని
ఏమనాలో తెలియక
దిక్కులు చూస్తున్నాడు -
"ఆకాశం" అని పిలిచినా
"అంతరిక్షం" అని తలచినా
"అనంతం" అని కొలిచినా
అర్థంలేని మాటే అవుతుందన్న
యదార్థం తెలుసుకుంటున్నాడు

అన్నీ తానే అయిన "అక్షరం" చుట్టూ
వెన్నంటితిరిగే వెలుగు-చీకట్లను
కన్న తల్లి శూన్యమని
చుక్కల మౌన ప్రవచనం -
ఏ భాషలో, ఏ శాస్త్రంలో
సృష్టికీ, సృష్టిని సృష్టించిన శూన్యానికీ
లేదేమో నిర్వచనం
అన్నిటి కన్నా తేలికైన శూన్యం
ఎన్నిటినైనా భరించే శక్తిశాలి
అహంకారం విడిచిపెట్టి ఆలోచిస్తే
అవగతమయ్యే సత్యం శూన్యం
మమకారం పెంచుకొని ఆహ్వానిస్తే
ఆత్మానందంగా వచ్చే అనుభూతి శూన్యం

జె. బాపురెడ్డి

# ప్రశ్నార్థకాలు

అడవిలో చొరబడి అలమటించే భయానికి
అభయ మిచ్చే దెవరు ?

ఆకుల చప్పుడుకు వణకే
పిరికి తనానికి
ధైర్యమిచ్చే దాత ఎవరు ?

పిట్టల సందడి తట్టుకోలేని చెట్టుకు
పూలుపూచే వసంతమేది ?

నదిని చూసి బెదరిపోయే గట్టుకు
చేరవచ్చే పడవలేవి ?

ఉప్పునీరు రుచించని నదులకు
స్వాగతించే ఉదధి ఏది ?

మెరుపుల దెబ్బలు భరించలేని మబ్బులను
సాహస యాత్రకు పిలిచే నేలఏది ?

అడిగినా అమ్మ అన్నం పెట్టదనే
అపోహకు
ఆత్మవిశ్వాసం కలిగించే గీతామృతం ఎక్కడ ?

"పుట్టడం గిట్టడం కొరకే" అనుకునే
మెట్ట వేదాంతాన్ని
వరించే జీవితం ఎక్కడ ?

నీటిలో దిగననే సోమరితనానికి
ఈతనేర్పించే కొలనేది ?

కలలే నిజమని నమ్మే నిద్రను
మేలుకొలుపే ఉదయమేది ?

# మాయల మ్యానిఫెస్టో

తెలివితేటలు ఎక్కువైన మనిషి
"త్రికరణశుద్ధికి" అశుద్ధి తీర్థం ఇచ్చి
సవర్ణదీర్ఘ సంధి చేసుకొంటున్నాడు -
స్వార్థోన్మాద జీవితాశయాల
మాయల మ్యానిఫెస్టోను
అసురదీక్షతో అమలు చేస్తున్నాడు -

అహంభావం పెంచుకొని
ఆత్మజ్ఞానం త్రుంచుకొని
చెప్పరాని ఘోరాలను
చేయకూడని నేరాలను
చిటికలో చేసేస్తున్నాడు -

ఊసరవెల్లులు కూడా ఈసడించే
వేషాలతో
నక్కలు కూడా బిత్తరపోయే జిత్తులతో
సురలోకం చేయవలసిన నరలోకాన్ని
నరకలోకం చేస్తున్నాడు -

సిద్ధాంతాలు వల్లిస్తున్నాడు
రాద్ధాంతులు సృష్టిస్తున్నాడు
గీతామృతంకన్నా తీయని నీతులు బోధిస్తున్నాడు
భూతప్రేతాల అండతో గోతులు తీయిస్తున్నాడు -
"అపకారం చేసినందుకు
ఉపకారం పొందుతున్నాడు -

జె. బాపురెడ్డి

ఆకలికి కేకలు నేర్పిస్తూ
అన్నార్తులకు సున్నం పెడుతున్నాడు
మాయలెరుగని మానవత్వానికి
మత మౌఢ్యం నూరి పోస్తున్నాడు
కూల్చివేస్తామంటున్న కులతత్వానికి
బీటలు పడని కోటలు కడుతున్నాడు -

అతడు పుస్తకం విజ్ఞానపుబుట్ట పఠించే
ఆచరించే మస్తకం మోసాల పుట్ట
అలంకారాలతో ముస్తాబు చేసి
అసత్యాలను సత్యాలుగా ఆడిస్తాడు -

చాటుగా చెపితే
అర్థం కావటం లేదంటాడు
తేటగా చెపితే అర్థమే లేదంటాడు
న్యాయాన్ని ధర్మాన్ని అనాథల్ని చేసి
అడుక్కుతినేటట్లు చేశాడు
కోకిల పాటల పరీక్ష
కాకులతో చేయిస్తూ
వసంతాన్ని పంచిస్తున్నాడు
బడుగులకు ఈ లోకంలో
బ్రతుకు బాటలు మూసేసి
పరలోకంలో అన్ని సుఖాలు లభిస్తాయని
హామీ ఇస్తున్నాడు
అధికార పక్షమైనా, ప్రతిపక్షమైనా
వివక్ష చూపక
అన్నీ తన పక్షమే అంటూ
అందలం ఎక్కి పోతున్నాడు.

# చెట్లు చెదిరిన అడవి

చెట్లుపారిపోయాయి
బుల్లెట్ల గర్జనలకు
పక్షులు నేలకూలిపోయాయి
చెట్లు చెదరిపోయిన అడవుల్లో -

ఆశగా వచ్చిన ఆమని
పూస్తున్నది పువ్వులు కాదు
అశ్రువులు
క్రేటుకొని వచ్చిన కోకిలలు
వినిపిస్తున్నవి పాటలు కాదు
నిరాశానిట్టూర్పులు -

ఎడారులు మొలుస్తున్నాయి ఇప్పుడు
కడాని సీమల్లో
మృగతృష్ణలు మెరుస్తున్నాయి
మృగాల గుండెల్లో
ఉగాది మీద కవితలు చల్లాలని
ఉవ్విళ్లూరే కవుల నోళ్లు
సమ్మె చేస్తున్న కలాలతో
సంప్రదింపులు జరుపుతున్నాయి
పద్యం, గేయం, గద్యం
పరస్పర గౌరవాదరణతో
ప్రక్రియల కోసం కాకుండా
సుక్రియల కోసం పాటుపడాలని

ప్రకటనలు చేస్తున్నాయి
ఇజాల వలల్లో చిక్కకుండా
నిజాల జాడ వెదకాలని
భూజాలు కలుపుతున్నాయి

పాటల తోటలు
పూవుల బాటలు
ఆశల కోటలు
అపోహల వేటలు
పరస్పరావగాహనతో చేసిన
ఉగాది పచ్చడి
పాతనోళ్లకు రుచించక పోయినా
ప్రగతి హస్తం
పంచిపెడుతున్నది
"స్వార్థం లేని పదార్థం" ఇది అని
సహజీవనం ధ్రువీకరిస్తున్నది
అంగీరిస్తునట్లుగా కాలం
ఆడిస్తున్నది తల, అది విని !

# సంధికుదరని శబ్దాలు

కలిసిపోయిన "రామచంద్రు"ల్ని
కాలచక్రం చీల్చినప్పుడు
రామశబ్దం - చంద్ర శబ్దం
రెండుగా విడిపోయినప్పుడు
దేశమంతా దద్దరిల్లింది
దిక్కులన్నీ పిక్కటిల్లాయి -
"అన్నదమ్ముల" వంటి సంబంధం
విచ్ఛిన్న మైపోయినందుకు
"అన్న" అటు, "తమ్ము"లిటు చేరి
సంధికుదరని శబ్దాలై
రణవ్యూహాలు పన్నినప్పుడు
వ్యాకరణం నివ్వెర పోయింది
భాషాశాస్త్రం మూగపోయింది
తర్జన భర్జనలకు దిగిన
తర్కాలు, సూత్రాలు
సమస్యా పరిష్కారం చేయలేక
సతమతమైనాయి -

భావబంధం లేని పదబంధాలు
సంధికుదరని శబ్దా లౌతాయని
శాంతిమార్గం చూపించాయి;
బాలవ్యాకరణం కంటే
భాషా శాస్త్రాలకంటే
జనసమ్మతీకరణాలే
జయిస్తాయని భాష్యం చెప్పాయి

శబ్దాల తప్పొప్పులు నిర్ణయించేది
నిఘంటువులు కాదని
ప్రజల "పలుకుడు"లే అని
ప్రజాస్వామ్యం తీర్పు చెప్పింది

# నిర్మాణ నిర్మూలనాలు

తళుక్కున మెరిసిన ఊహల్ని
అక్షరాలు ఆర్పేస్తున్నాయి

నిద్రలో మేల్కొన్న కలల్ని
వేకువలు పాతేస్తున్నాయి

భాషలేని కోకిల పాటల్ని
భావాలు తరిమేస్తున్నాయి

చెట్లు పూచే వివేకాన్ని
శిశిరం తుడిచేస్తున్నది -

మబ్బులు చల్లిన నీడల్ని
ఎండలు ఊడ్చేస్తున్నాయి -

నేలను కొలిచే ఎండటాకుల్ని
గాలిరెక్కలు లేపుకపోతున్నాయి

ప్రతీకలు తీర్చిన భావచిత్రాలను
టీకాతాత్పర్యాలు వికారం చేస్తున్నాయి

వ్యంజనల రూపచిత్రాలను
వ్యాఖ్యానాలు వక్రీకరిస్తున్నాయి

ఆత్మలు మెరుగుపరచిన సత్యాలను
అలంకారాలు మరుగుపరుస్తున్నాయి !

మనిషిని కొలిచే మానవత్వాన్ని
కులమతాలు కూల్చేస్తున్నాయి !

# సమస్యా పూరణాలు

ముక్కలైపోతున్నది మా స్నేహం
అతికించే సాధనం ఏది ?
సహనం -

జీవితం చితికి పోతున్నది
బ్రతికించే విభూతి ఏది ?
బాల్యానుభూతి !

ఐశ్వర్యం మనశ్శాంతిని ఆర్పివేసింది
వెలిగించే దీప్తి ఏది ?
సంతృప్తి !

దేశం వట్టిమట్టి అయిపోతూంది
మనుషులుగా మార్చేవరం ఏది ?
గురజాడ ముత్యాల సరం -

అడవిని
చిట్టెలుకలు కొరుక్కుతింటున్నాయి
రక్షించే నాథుడెవరు
చెరనుండి బయటపడే
సింహం -

# శాంతి కన్న స్వాప్నిక శిశువు

"శాంతి" తాను కలలుగన్న
సౌభాగ్య శిశువును ప్రసవించింది
ఆమె భయభ్రాంతి తిమిరాలను
తన భావ సీమలనుంచి
బహిష్కరించింది -

ఆశానక్షత్రనేత్ర ఆకాశం
ఆనందం కురిసింది
అమ్మతనం విరిసిన నేల
గాలి ఊయల కట్టి
జోలపాడింది
చిద్విలాస శిశువుకు -

ఉప్పొంగిన సాగరతరంగాలు
అభినందన నాదాలతో
బారులు తీరివచ్చి నేలతల్లి మెడలో
యశోవర్ణ
డండీర హారాలు వేశాయి

ఋతువులన్ని జతకూడివచ్చి
కాలచక్రం మెచ్చి అభయమిచ్చే
జాతక చక్రం వేశాయి
ప్రకృతి పరవశించి దీవించింది
ఆబాల గోపాలం
ఆత్మీయంగా స్పందించింది -

పేరు పెట్టుమంది శాంతి
ఆ సౌభాగ్య శిశువుకు
ముక్కోటి దేవతులు తలచే
త్రిమూర్తులను
సమస్త లోకాలు కొలిచే
ముగురమ్మలను -

ఏ పేరూ సరిపోని
రూపసి ఈ పాపడని
జాతకుడీ బాలుడని
వేదవిదులు విస్తుపోయారు
"పేరుపెట్టు" కొనే వ్యక్తిత్వం కాదు
"పేరుతెచ్చు" కొనే అస్తిత్వం ఇతనిది
అన్నారు విజ్ఞాన వివేకకోవిదులు
ఔనన్నారు శాంతి ప్రియులైన
త్రిలోకవాసులు -

# మనిషినోట దేవుని మాట

నా "మేధస్సు"
"లోభా"న్ని పెంచుతూంది
విద్వేషాన్ని పోషిస్తూంది
మేదస్సు ను లెక్కచేయకుండా "మనసు"
ప్రేమను విరజిమ్ముతూంది -

మేధస్సు ప్రాకులాడుతూంద
అర్థంకోసం - ఐశ్వర్యం కోసం
మనస్సు పరితపిస్తూంది
అన్యోన్యత కోసం - ఆరోగ్యం కోసం -
నా మేధస్సు నన్ను చెదరగొడుతున్నప్పుడు
నేను నా మనస్సును ఆశ్రయిస్తాను -

"జీవితం నాలుగనాళ్ల ఆట
ప్రేమ నిలిచిపోయే కోట
ప్రేమించడమే - జీవించడం"
నినదిస్తూంది నా మనస్సు

"స్వార్థమే పరమార్థం
మార్గం కాదు ముఖ్యం గమ్యం
పేరాశే జీవిత పరిబాష"
ప్రవచిస్తూంది మేధస్సు

నాశిశుత్వం
పీల్చిన చనుబాలు ప్రేమే
నా తలిదండ్రులూ
ఇరుపొరుగూ
నా బాల్యానికి తనిపించిన ఆహారం ప్రేమే
వక్రీకరించిన
దుష్టనికృష్ట కాలం

"తెలివితేటలు" నిండిన
నా మేధస్సు పేటలో
కలుషితమైన, కంపుకొట్టే
ఆశల - ఆలోచనల కొట్టు పెట్టింది -
ప్రేమను మోసగిస్తూ
విద్వేశాన్ని విక్రయించింది
స్వార్థాన్ని పెంచుకుంటూ
త్యాగాన్ని దోచుకుంది -
ఇప్పుడు
అస్తమిస్తున్న నా జీవితానికి
ఆనందాల కడలిలో ఊడిపడుతున్న
అనుభూతి కలుగుతున్నది
ప్రత్యర్థులమను మాటమరచి
స్నేహాలింగనం చేసుకుంటున్న
నింగినేలల దిక్చక్రంపై నేను
రాలిపడుతున్న స్ఫూర్తి వెలుగుతున్నది
రెక్కలూడిన నా అస్తిత్వం
ఒక వినూత్న ప్రపంచపు ముంగిట్లో
కాలుమోపినట్లు అనిపిస్తున్నది
అక్కడ
సౌందర్యం సర్వోన్నతంగా ఎగసిపోతున్నట్లు
ప్రేమ తనలో తానే
తాదాత్మ్యం చెందుతున్నట్లు
సంకేతాలు కనిపిస్తున్నవి
అక్కడ
మనిషినోట దేవుని మాట వినిపిస్తున్నది
ప్రేమవాటిలో వికసిస్తున్న
వసంతం పరిమళిస్తున్నది.

జె. బాపురెడ్డి

# నవ్యవసంతవాణి - నాయని

భావం మృగ్యమైన భాష
జీవం లేని వేషం వేసి
"కవిత్వం" అనే పేరు పెట్టుకొని
తెలుగడ్డమీద చిందులు వేస్తుంటే
ఆక్రోశించిన గుండెల్లో నుంచి
ఆవిర్భవించిన రాసావేశం
నాయని సుబ్బారావు -

"సరస్వతీ నారద సంవాదం" విని
కుందిన కందుకూరి అంతరంగం
ఆవిష్కరించిన నవశకాన్ని
నడిపించిన నాయక వర్గంలో
నవ్యకవితోద్యమకారుడు
నాయని సుబ్బారాయుడు -

మిసమిసలాడే పడచువాళ్లకే కాదు
వసివాడిన
ముసలిపీఠాలకు కూడా
నవ్యచైతన్య పాఠాలు నేర్పిన
వాడిపోని వసంతవాణి - నాయని

భారతదేశ చరిత్ర సంస్కృతులను
తెలుగు జాతి జీవన గతులను
ప్రణయ రాసార్ద్రచిత్తంలో
ప్రణవ శీల పరమార్థంలో

దర్శించి
ఆవేదనా వేదాలుగా
ఆత్మానుభూతినాదాలుగా
శ్రుతి చేసిన కళామయుడు
సుబ్బారావు!

"మాతృగీతాలు" మొదలు
"విషాద మోహనం" వరకు
విస్తరించిన నాయని సాహిత్యచరిత్రలో
"సౌభద్రుని ప్రణయాత్ర
రసపిపాసువులకు అమృతపాత్ర!

యువకవిగా, నవకవిగా
అతని అపురూప భావ సౌందర్యంలో
ఒకప్పుడు ఓలలాడిన విద్యార్థి నేనే
అతని "శతజయంతి" కి
కీర్తి వైజయంతిని ఎగరవేసిన
కాలాన్ని అభినందిస్తున్న
నిత్య సత్యార్థిని,
నేనిప్పుడు.

జె. బాపురెడ్డి

# కల్లోలబాష్పాలు

కనికరం లేని మెరుపులు
దిక్కులేని మబ్బులపై
కొరడాలు విసురుతున్నాయి
మతిలేని వెర్రి ఆవేశంతో -
భయకంపితులైన మబ్బులు
గడ్డకట్టే బాధతో పగిలి
ఏడ్పుల ఉరుములతో
ఉప్పొంగే కన్నీరుగా కారిపోతున్నాయి -

ఆశ్చర్యం ఏమిటంటే !
చుక్కలు పొదిగిన తన నీలితెరవెనుక
అ ప్రమేయ రహస్యాలు దాచిఉంచే
ఆకాశం
ఈ కన్నీటిబాధల్ని భరించలేపోతున్నది
వాటిని, పుడమితల్లి ఒడిలోకి
జార విడుస్తున్నది
అయితే, నమ్మజాలని నిజమేమిటంటే,
స్వేచ్ఛా ప్రియులైన మబ్బులు
గాలిరేగిన రాత్రుల్లో
చీకటిమీద ఆందోళన చేసినందుకు
కార్చవలసివచ్చిన కన్నీటిని
ప్రేమ స్పర్శతో
దయామయిఅయిన భూ మాత
పరవళ్లు త్రొక్కే
జీవితాలుగా మార్చి వేస్తున్నది
చల్లని చిరునవ్వులుగా తీరుస్తున్నది
పరితప్తులైన మానవాళి కోసం

# సాటిలేని పిరమిడ్లు

సాటిలేని మేటి పిరామిడులను
నేను కౌగిలించి ముద్దు పెట్టాను
అవి
ప్రాచీన నాగరిత ప్రేమగోపురాలై
నైలునదీ తీరంలో
కాల సైకతాల మీద
కాలక్షేపం చేస్తున్నాయి -

పైపై సమాధుల్లోని
అగాధమైన నిశ్శబ్దం లోపడి ఉన్న
మట్టి మనుషులు చేసిన మహత్కార్యాలను
అవి మననం చేసుకుంటున్నాయి -

వాటి శిఖరాలు
అనాదిగా విస్తరించిన
ఆకాశపు శూన్యాన్ని చీల్చుకుంటూ
చీకటి ఖండం మీద
వెలుగు వాన కురిపిస్తున్నాయి -

తళతళలాడే
మధ్యధరా సముద్ర తరంగాలు
విజేతయైన నైలునదిని
స్వాగతిస్తున్నాయి,
సంక్షుభిత చరిత్రజనిత
సమున్నత శోభాశిఖరాలకు
శ్రమజీవిన జనకోటి ఆత్మదీక్షా క్షేత్రాలకు
ఆహ్వానిస్తున్నాయి.

# హద్దులేని అహంకారాలు

ఎండిపోతున్న చెట్ల మీద
వాడిపోతున్న ఆకుల వెనుక
కిచకిచలాడే పిచ్చుకలు
భావిస్తుంటాయి -
అంతులేని ఆకాశమంతా
వాటి గర్జనలతో ప్రతిధ్వనిస్తుందని -

ప్రాచీన ఆలయాల
పాడుబడ్డ గోడల మీద
ప్రాకులాడే చిట్టి చీమలు
ఊహిస్తుంటాయి
కదంత్రొక్కి అవి నడుస్తుంటే
భూమి కంపించి పోతుందని

కంపుగొట్టే మురుగు కాల్వలమీద
మూల్లే దోమలు
అనుకుంటాయి
ప్రేరేపించే శ్రావ్యతగల
చావులేని భావగీతాలు
తామే అల్లుతున్నట్లు -

బొందల్లో, బొరియల్లో
బకబకలాడే కప్పలు
మిడిసి పడుతుంటాయి
తమ నిగమ సంగీతానికి
స్పందించే మిన్ను కురుస్తుందని.

# కంప్యూటర్‌కు నా మనవి

ఓ ప్రియమైన కంప్యూటరీ!
మానవజాతికి మారణాంతమైన
పథకాలు వేసే వారికోసం
పనిచేయటం మానేయమని
ప్రార్థిస్తున్నాను.
అందుకు బదులు
ఒక అద్భుత కవిత వ్రాయమంటున్నాను.
అనంత నీలాకాశాన్ని ఛేదించి
ఆత్మీయంగా
ఆదితుదులను ఆవరించి,
తప్పించుక తిరుగుతున్న దేవున్ని
పట్టుకొని తెచ్చి
ప్రతి మానవుని హృదయంలో ప్రతిష్ఠించే
కవిత వ్రాయమని
పదే పదే ప్రార్థిస్తున్నాను -

నీవు ఏ భాషలో వ్రాసినా సరే
దాన్ని నేను
సృష్టిమూల ప్రేమభాషలోకి అనువదిస్తాను
నేను "దివ్య రచయిత"నని చెప్పుకుంటే
దయ్యాలు ఒప్పుకోకపోయినా సరే!
నేను మాత్రం నీవు
"అదృశ్య రచయిత"గా ఆదరించి ఆరాధిస్తాను.

జె. బాపురెడ్డి

# లతాంత వేదాంతం

లతాంత పుష్పం
జీవతలతాంతం బాష్పం
ఎక్కడ పూచినా
పుష్పాలు పుష్పాలే
ఎవరు రాల్చినా
బాష్పాలు బాష్పాలే -

మా ఊరు జడలో విరిసిన
మల్లెపూల పరిమళాలను
మసూరి కొండల గుండెల కురిసిన
ప్రసూన దళాలను
జతచేసిన జానపదగీతాన్ని
వేదనారమ వినిపించింది
కాలిఫోర్నియా కంఠంలో -

సుమ సావిత్రి
సుందర శివానందలహరిలో
నాదెందం వికసించింది
హాలీ ఉడ్ కొండ లోయలో
కళాకేళీ ముగ్ధ నాయికలవలె
చిద్విలాసం చిందే గులాబీల
చిత్ర చిత్ర వర్ణ జగత్తును
కెమేరాలో బంధించలేక

గుండెకెమేరాలో బిగించాను
ఎక్కడున్నా పూవులన్నీ
ఒక్కటి అన్న సత్యాన్ని
చిత్రంగా చిత్రించాను -

స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు
కిర్మీర పక్షులై
తరులమీద లతలమీద
నిర్భయంగా
తిష్ట వేశాయో అన్నట్లు
అవర్ణనీయ వర్ణకుసుమాలు !
వాసనా వాసంతాల
విజయ దీపావళి
ఆ అఖండ సుమావళి -

పూల విలువ తెలిసిన
పూర్ణస్త్రీ సత్యభామ
పరమాత్మను కాలదన్ని
పారిజాతాలను వరించింది
ఒక్క పూలమొక్కకోసం
ఇంద్ర లోకాన్ని జాయించింది
జడపూల విలువ తెలియక
ఒకప్పుడు నేనూ
జడభరతుణ్ణయినాను
లతాంత వేదాంతంలో మునిగి నేడు
రసభరితుణ్ణయినాను -

# కన్నతండ్రి కడసారి కానుక

నను కన్నతండ్రి
తన ఆత్మోద్దీప్త తనువులో
అదుపులేని కాలపు
ఎనుబదియారు వత్సరాలను
చేరదీసి ప్రతిష్ఠించుకున్నాడు
వాటిని
మమతలతో, మందహాసాలతో
తలపులతో త్యాగాలతో
వలపులతో వాత్సల్యాలతో
కలలతో - కాంక్షలతో పోషించాడు-

తైలాభిషిక్తమైన తన భౌతిక కాయాన్ని
ఎగసిపోతున్న ఆత్మ ఇచ్చి పోయిన కానుకగా
నాకు బహూకరించాడు
జాలు వారే నా కన్నీటిలో
కదలలేని ఆ కళేబరాన్ని అభిషేకించి
భగభగమండే నా భావచితిపై
దహనసంస్కారం చేశాను
నా అవ్యాజ ప్రేమపాత్రలో
చితాభాస్మాన్ని సేకరించి
సాగరాల అగాధాల నిశ్శబ్దతలో
సౌభాగ్యాల పేటికగా భద్రపరచాను -
పాటలు పాడే ఏటి కెరటాల మీద

పసిడి పూలుగా వెదజల్లాను
సుప్త చైతన్యపు అవంధ్య గర్భాశయంలో
దీప్తి బీజాలుగా నాటాను
ఇప్పుడు
ఆయన ప్రతిబింబం
సురభిళ స్మృతుల చట్రంలో
తీర్చిన ఒక స్వప్నమై
నా చిరంతన అజ్ఞాన కుడ్యం మీద
నిరంతరం వ్రేలాడుతూన్నది!

*(కన్నతండ్రి జంకె కృష్ణారెడ్డి 1987లో దివంగతుడైనప్పుడు కలిగిన ఆవేదనానుభూతి)*





ప్రకాశించే ప్రతిభకు, ప్రజాస్వామిక ప్రగతి శీలతకు, పరిమళించే పద చిత్రాలకు ప్రయోజనాత్మక తాత్విక భావుకతకు సమాహారమైన ప్రతి రూపం డా. జె. బాపురెడ్డి. 'చైతన్యరేఖల' నుండి 'శ్రీకారశిఖరం' వరకు పరిణతి చెందిన ఆయన కవితా చేతన 'మన చేతుల్లోనే ఉంది' అనగలిన ఆత్మవిశ్వాసాన్ని 'కాలం మాయాజాలం'మ కనిపెట్టగలిగిన తాత్విక దర్శనాన్ని ప్రదర్శించింది. ఆయన 'ఆటపాటలు' ఆబాలగోపాలాన్ని అలరించింది. సాహితీ సరస్వతికి ఆయన 'జీవన శ్రుతులు' రసానంద బహుకృతులు. ఆయన షష్టిపూర్తి సంచికగా వెలువడిన 'బాపురెడ్డి సాహితీ భారతి' ఆయన సాహిత్య విరాట్ స్వరూపాన్ని విశ్వమానవ ప్రేమ తత్వాన్ని ఆవిష్కరించింది.

కాలగతిని గమనిస్తూ, కలానికీ, గళానికీ క్రొత్త పోకడలను అలవరచే ప్రతిభాశాలి డా. జె. బాపురెడ్డి, పద్యాన్ని, గేయాన్నీ, వచనాన్నీ, కవితా ప్రయోగాలలో కళా గౌరవంతో పోషించగలిగిన సమకాలీన కవుల్లో బాపురెడ్డిగారు మొదటి వరుసలో నిలుస్తారు.

బాపురెడ్డిగారికి గేయం ఒక విజయకేతనం. లలిత గేయాలనూ, భావ గీతాలను, పాటలనూ, గేయరూపకాలను, నృత్యసంగీత స్వరవల్లికలనూ స్వీయముద్రతో చిత్రించిన మధురకవీ, మార్మిక కవీ, తత్వకవీ బాపురెడ్డి.

ఆంగ్ల కవితా సంపుటాలు వెలయించటంలోనూ, ప్రణవాన్నీ, ప్రణయాన్నీ, సామాజిక ప్రగతిని జీవితంలో ముప్పేటగా భావించే సమగ్ర దృక్పథంతోనూ, ప్రపంచ కవుల మహాసభల్లో తెలుగు వెలుగు బావుటను ఎగరవేయటంలోనూ ప్రపంచ భాషలలోనికి తమ కవితా వల్లికలను అల్లుకునేటట్లు చేసిన ఆంధ్ర పౌరుషంలోనూ, డా. బాపురెడ్డి గారు నేటి సాహిత్య రంగంలో అగ్రగణ్యులు.

1971లో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ పురస్కారం, 1984లో మొరాకోలో జరిగిన ప్రపంచ కవుల మహాసభ వారందించిన గౌరవ డాక్టరేటు పురస్కారం మొదలైనవి డా. జె. బాపురెడ్డి గారి ప్రతిభను చాటే కొన్ని గుర్తింపులు మాత్రమే.

1936లో కరీంనగర్ జిల్లాలో సిరికొండ గ్రామంలో పుట్టి, ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఎం.ఏ. (ఆర్థిక శాస్త్రం), పట్టం పుచ్చుకొని, ఐ.ఏ.యస్., ఆఫీసరుగా ఎన్నో ఉన్నత పదవులకు వన్నె తెచ్చారు. వృత్తులు ఎన్ని మారినా డా. జె. బాపురెడ్డి ప్రవృత్తి చేత మహాకవి.

- ప్రచురణ కర్తలు

